

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.


సంపుటము ౪౩

సంచిక ౧

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.

సహాయ సంపాదకులు :

కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.
వ్యాకరణ విద్యా భాషాప్రవీణ, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.
భాషాప్రవీణ, శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు.
ఐతిహాసిక సమ్రాట్, శ్రీ బండారు తమ్మయ్యగారు.

173

# విషయసూచిక

# విజ్ఞప్తి.

కాగితము కఱవును, బహుళవ్యాప్తమైన "ఫ్లూ" జ్వరమువలన ముద్రణాలయమున పనిజరుగమియును మా చందాదారులకు సకాలమున పత్రిక లందింపకుండుటకు ప్రధాన హేతువులు. ఇటబట్టి సకాలమున పత్రికలు చేరగలవని పరిషద్విజ్ఞప్తి-

కార్యదర్శి.




# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౫ | దుర్ముఖి సంవత్సరము మాఘ—ఫాల్గుణమాసములు | సంచిక ౬


## సింహావలోకనము

ఈ సంచికతో దుర్ముఖి సంవత్సరము సమాప్తమైనది. ఈ వత్సరము పరిషన్ముఖమున జరిగిన సాహిత్యసేవ సంతోషకరముగనే యున్నది. ఉగాదినాఁడు పరిషత్కార్యాలయమునఁ బంచాంగశ్రవణము, కవి పండితగోష్ఠియు జరిగినవి. మఱునాఁడు శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రిగారు పరిషత్ప్రేరణమునఁ దాము రచించిన "అహల్య" యను నూతనకావ్యమును పారిషదులకు శ్రవణమొనర్చిరి. బౌద్ధజాతకకథలందలి వస్తువును గైకొని అహల్య శీలమును చక్కఁగాఁ జిత్రించినారు. కావ్యపఠనసమయమున నొక సాహిత్యాభిమాని కవిగారికి నేఁబదియెనిమిది రూప్యముల నొసంగి సత్కరించిరి. మఱియొకరు కావ్యముద్రణ వ్యయమంతయు భరింతుమని వాగ్దాన మొనర్చిరి. ఆ మఱుసటివారమున కవిమూర్ధన్య శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు తాము రచించిన "దివానక్తము" అను వినూతన కావ్యమును బఠించిరి. ఇందలి కవిత్వము, కల్పనము హృదయంగమములు. ఈ కావ్యపఠనసమయమునఁ గూడ నొక సాహిత్యాభిమాని యేఁబదియెనిమిది రూప్యములను, కాశ్మీర శాలువును బహూకరించి కవిని సమ్మానించిరి. పరిషత్కార్య నిర్వాహకసభ్యులలో నొకరయిన విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్టు శ్రీ బండారు తమ్మయ్యగారి షష్టిపూర్తిమహోత్సవము 3—5—56 తేదిని పరిషద్భవనమునఁ బరిషద్వ్యాజమాన్యమున జయప్రదముగా జరిగినది,

ఆ సభకు తూర్పుగోదావరిమండల న్యాయాధిపతి శ్రీ టి హెచ్. ఎమ్. సదాశివయ్య, M. A B. L గా రధ్యక్షత వహించిరి. శ్రీ తమ్మయ్యగారు చిరకాలమునుండి పరిశోధన, విమర్శవ్యాసరూపమున సామాన్యముగా ఆంధ్రసాహిత్యమునకు, విశేషముగ వీరశైవ వాఙ్మయమునకు మహోపకార మొనర్చుట పలువు రెఱింగినదే. పరిషత్కార్యాలయమున ఆంధ్రమహాభారతమునకు తాళపత్రప్రతులు నూటికిఁ బయిగా నున్నవి. నేఁటి ముద్రితప్రతులను వీనితో సరిచూచి పాఠభేదసంకలనము గావించుటకయి 15–7–56 తేదిని స్థానికపండితుల సమావేశము పరిషద్భవనమున జరిగినది. పండితు లెల్లరు నీ యుద్యమము నామోదించి తమ తీఱిక వేళలఁ బరిషత్తునకుఁ దోడ్పడి యీ కార్యము నిర్వహింప సమ్మతించిరి. ఈపని క్రమముగా జరుగుచున్నది. ప్రస్తుతము మోడేకుర్రు సంస్కృతాంధ్రకళాశాలాధ్యక్షులుగా నున్న శ్రీ కొల్లూరి సోమశేఖర శాస్త్రిగారు పరిషదాహ్వానముపయి శరన్నవరాత్రములలో 12-10-56, 13-10-56 తేదులను ఆర్ష, బౌద్ధదర్శనములనుగూర్చి పరిషద్భవనమునఁ జక్కని యుపన్యాసము లొసంగిరి. ఆసభలకు వేదవిద్యావిశారద శ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రిగా రధ్యక్షత వహించిరి. జగత్ప్రసిద్ధి నందిన శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణపండితులు రచించిన Indian Philosophy అనెడి యుద్గ్రంధమునకు కాకినాడ కళాశాలలో ఆంధ్రభాషోపన్యాసకులుగాఁ బనిచేయుచున్న శ్రీ బులుసు వేంకటేశ్వరులు, M. A. గారు "భారతీయతత్త్వశాస్త్రము" అను పేరితో నాంధ్రానువాద మొనర్చి నాలుగుసంపుటములుగాఁ బ్రకటించి లోకోపకార మొనరించియున్నారు. ఇందుకయి కేంద్రప్రభుత్వమువారు శ్రీ వేంకటేశ్వరులుగారి కొనర్చిన సమ్మానాదికముల నభినందించుచు 1–12–56 తేదిని కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ, M. A. గారి యధ్యక్షతను బరిషద్భవనమున మహాసభ గావింపఁబడినది. పలువురు పండితులు శ్రీ వేంకటేశ్వరులు గారి పరిశ్రమను బ్రశంసించుచు నుపన్యసించిరి. పూర్వోదాహృతు

లయిన పండితవరేణ్యులు, చతుస్తంత్రి శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రి గారి షష్టిపూర్తిమహోత్సవము పరిషదధ్వర్యమున నే శ్రీమత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులు, M A గార యధ్యక్షతను 3—2—57 తేదిని శ్రీ వేణుగోపాలస్వామివారి యాలయావరణములో మహావైభవముతో జరుపఁబడినది. శాస్త్రిగారి శిష్యవర్గము, ఇతరదాతలు నొసంగిన విరాళముల మొత్తము సుమారు మూఁడువేల రూప్యములతో సభాముఖమున శ్రీ శాస్త్రిగారికి సత్కారము గావింపఁబడినది. పరిషత్కార్యనిర్వాహకసభ్యులలో నొకరయిన కవికంఠీరవ, కవిమూర్ధన్య శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు పరిషత్కార్యదర్శి శ్రీ ప్రతివాదిభయంకరము పార్థసారథిగారి కంకితముగా, శ్రీనాథ కవిసార్వభౌముఁడు కర్ణాటరాజాస్థానమునఁ బడసిన కనకాభిషేకసత్కార కథను బురస్కరించికొని, "కంచుఢక్క" యను పేరి నూతనకావ్యమును రచించినారు. తత్కృతిసమర్పణమహోత్సవము పరిషద్వ్యాజమాన్యమున 25—3—57 తేదిని కాకినాడ పురమందిరమున పరిషదధ్యక్షులు మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి యధ్యక్షతను శోభాయమానముగ జరిగినది. బౌద్ధదర్శనములకుఁ జెందిన నాగార్జునుని మధ్యమకారికావళికి ఏకైకప్రతి యొకటి యపూర్వముగ లభింపఁగా దానిని శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రిగారిచేఁ బరిష్కరింపించి, విశ్వవ్యాప్తికయి దేవనాగరిలిపిలో ముద్రింపించి పరిషత్పత్రికలో అనుబంధముగా ప్రకటించుచున్నాము. అది ప్రత్యేకగ్రంథరూపమునఁ గూడ నచిరకాలములో వెలువడఁగలదు.

పరిషత్పత్రికలో నిశ్శంకుల కొమ్మనామాత్యుని శివలీలావిలాసము కొంతవఱ కింతకుమున్ను ప్రకటితమై యున్నది. అవశిష్టభాగ ప్రకటనముగూడ మరలఁ బ్రారంభింపఁబడినది. త్వరలో నది పూర్తి కావింపఁబడును.

# పండితరాజ జగన్నాథుని వైశిష్ట్యము

శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రిగారు

భారతవర్షమునం దలంకారశాస్త్రము దొలుత భామహుఁడు మున్నగు ప్రాచీనులచేఁ గాశ్మీరమునం దావిర్భవించి, బహుముఖములఁ బ్రస్తరిల్లి తుద కాంధ్రదేశమున స్థిరపడినది. అనఁగా నలంకార శాస్త్రము భామహునితోఁ బ్రారంభమై జగన్నాథపండితునియందు స్థిరపడినది. భారతవర్షమున బయలుదేఱిన యాలంకారికు లందఱిలోను జగన్నాథపండితుఁడు కడు సమర్థుఁడనియు, నాతఁ డలంకారశాస్త్రమును తీర్చిదిద్ది సర్వాంగసుందరముగ నొనర్చె ననునదియు నిర్వివాద మను విషయమున నాతఁడు రచించిన "రసగంగాధరము" అను గ్రంథరాజ మన్ని దేశములందును నిరుపమానమగు ప్రశస్తినంది ప్రచురప్రచార మునం దుండుటయే దీనికి తార్కాణము. ఈపండితరాయలు తన గ్రంథారంభమున, తిములను మత్స్యముల సంక్షోభమువలన, మంథాద్రి మథన మెట్లు గతార్థము కాఁజాలదో, అట్లే ఇతర గ్రంథములచే నా గ్రంథము చరితార్థము కాదని స్పష్టముగఁ జెప్పియున్నాఁడు. మఱియు నీతఁడు దొలుతనే యుదాహరణముల నిచ్చుటకు "భామినీ విలాసము"ను కావ్యమును నిర్మించి తన ప్రబంధమునందలి యుదాహర ణములఁ జూపుచు వచ్చెను. కాన నీతఁడు కేవల పండితుఁడే గాక మహాకవియు; పాండిత్యకవిత్వము లొకతావునఁ జేసుట అరుదు.

ఈతఁడు తన గ్రంథమునకు "రసగంగాధర"మను పేరువెట్టి, దాని కనువుగ నైదాననముల గల్పించెను. అందు మొదటిది రసాననము. రెండవది ధ్వన్యాననము. మూఁడవది యలంకారాననము. దోషాననము నాల్గవది. అయిదవది గుణాననము. కాని ఇపు డలంకారాననము నం దుత్తరాలంకారము వఱకు మాత్రమే యీగ్రంథము మన కగపడు చున్నది. మిగిలిన రెం డాననములు లోపించినవని నాతలంపు.

ఈతఁడు దొలుతనుండియుఁ దన వైశిష్ట్యమును జూపుచునే వచ్చెను. చూడుఁడు.

1. ప్రాచీనాలంకారికులు, నిర్దుష్టములు, గుణాలంకార సహితములు నగు, శబ్దార్థములు రెండును గావ్యమని కావ్యలక్షణమును నిరూపించిరి. కాని శరీరమునకు శోభను గలిగించెడి గుణాలంకారములను శరీరమనుట యెట్లు పొసంగదో, అట్లే కావ్యమునకు శోభను గలిగించెడి గుణాలంకారములను గూడ కావ్యమునందుఁ జేర్చుట సరి కాదు. మఱియుఁ గావ్యమును విటిని కాని యర్థము దెలియుటలేదను లోకప్రసిద్ధినిబట్టి, యర్థమునుగూడ కావ్యశరీరమునందుఁ జేర్చుటయు యుక్తముకాదు. మఱియు శబ్దము అర్థము ననురెండును గలిసియే కావ్యమను వీరిమతమునఁ గేవల శబ్దము కావ్యమనుట పొసఁగదు. కాఁగా మనము ఏశ్లోకములను గావ్య మను చుంటిమో, అవి వీరి మతమునఁ గావ్యములనుట సరిపడదు. కాన "రమణీయార్థమును ప్రదిపాదించెడి శబ్దమునే కావ్య"మనవలయునని కావ్యలక్షణమును నిరూపించెను.

2. మమ్మటుఁడు, శక్తి, నైపుణ్యము, అభ్యాసముననునీమూఁడును గలిసి, కావ్యమునకుఁ గారణమని నిరూపించెను. ఈతఁడు ప్రతిభావంతున కభ్యాసముతోఁ బనిలేదనియు, ప్రతిభాహీనుని యభ్యాసము వ్యర్థమనియు నాతని మతమును నిరసించి, ప్రతిభ కాని, దేవతానుగ్రహము గాని, కావ్యమునకుఁ గారణములని నిరూపించెను.

3. కావ్యము, ఉత్తమము, మధ్యమము, అధమ మను ప్రాచీనుల విభాగమును నిరసించి, కావ్యము, ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము, అధమము, అని నాలుగు విధములనియు, నధమాధమ కావ్యము లేదనియు నిరూపించెను.

4. "విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" అను భరతసూత్రము ననుసరించి, యభినవగుప్తాదుల మతములఁ దొలుత

నిరూపించి, నవ్యాస్తు, అని మొదలిడి, కావ్యమునందు కవిచేతను, నాట్యమునందు నటునిచేతను, వ్యంజనావ్యాపారముచేఁ బ్రకాశితములగు విభావానుభావ వ్యభిచారిభావములచే శకుంతలయందు దుష్యంతునికిఁ గల యనురాగము తెలియును. పిమ్మట సహృదయునియొక్క భావన (తఱచుగ దానినే యనుసంధించుట) యొక్క మాహాత్మ్యము వలన నజ్ఞానముచే నావరింపఁబడిన ముత్యపుఁజిప్పయం దనిర్వచనీయమగు రజతము పుట్టినట్లు, భావనచేఁ దాత్కాలికముగ కల్పితమగు దుష్యంతత్వ మను ధర్మముచే నాక్రాంత మగు సహృదయుని యాత్మయం దనిర్వచనీయమగు రతిపుట్టును. ఈయనిర్వచనీయమగు రతియే రస మనఁబడుచున్నది. ఈరతి సహృదయునియందుఁ బూర్వసిద్ధమగు రతితోడను, పశ్చాత్సిద్ధమగు నాహ్లాదముతోడను నీర క్షీరన్యాయమున గలిసినందున, కవులకు వర్ణనీయమును, సహృదయుల కాస్వాదనార్హము నగుచున్నది. అని వేదాంతుల శుక్తిరజతము నుదాహరణముగ గైకొని విలక్షణమార్గమున రసస్వరూపమును నిరూపించెను.

మఱియుఁ గరుణారస సందర్భమున శోకము స్థాయిభావముగఁ గల కరుణకు రసత్వ మెట్లు పొసఁగునని శంకించి, కరుణ రస ప్రధానములగు కావ్యములందు శృంగార రస ప్రధానములగు కావ్యములందువలె కేవలాహ్లాదమె సహృదయుల కనుభవ గోచరమగునేని అపుడు లోకోత్తరమగు కావ్యవ్యాపారమునకె యట్టి యాహ్లాదమును బుట్టించుటయు, దుఃఖమును ప్రతిబంధించుటయు నను సామర్థ్యము నంగీకరింపవలయును.

లేదా కావ్య వ్యాపారమువలన నానందమును, స్థాయిభావము వలన దుఃఖమును కరుణయందుఁ గలుగును. ఆహ్లాద మధికమగుటవలన దుఃఖ మల్పమగుటవలన నట్టి కావ్యములందుఁ గవులకుఁ బ్రవృత్తియు క్షమే యని నయు క్తికముగ నిరూపించెను.

మఱియు శాంతరసమును నాటకములందుఁ బ్రదర్శింపవచ్చు ననియుఁ వీరరసము, దానవీర దయావీర, పాండిత్య వీరాది భేదముల బహువిధముల నగుచున్నదనియు సోదాహరణముగ నిరూపించెను. ఈరసవిచార సందర్భమునఁ బ్రాచీనోదాహరణముల సయుక్తికముగ నిరసించెను. చూడుఁడు.

"వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।
జగతఃపితరౌవందే పార్వతీపరమేశ్వరౌ"॥

ఇటఁ బార్వతీపరమేశ్వరులకు గల నిరతిశయప్రేమ మభివ్యక్త మగుటచే శృంగారరసధ్వని యని కొందఱనుచున్నారు. కాని అది సరికాదు. ఇట నభివ్యక్తమగు శృంగారము కవికి నాపార్వతీపరమేశ్వరు లందుగల భక్తిభావమున కంగమగుటవలన నిట రసధ్వని యనుట చెల్లదు. ఇట్లే ప్రాచీనోదాహరణములను చాలవఱకు నిరాకరించి తన కావ్యమునందలి యుదాహరణములనే చూపెను.

మఱియు

"శూన్యంవాసగృహం విలోక్య శయనా దుత్థాయకించిచ్ఛనై
ర్నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్యపత్యుర్ముఖం
విస్రబ్ధం పరిచుంబ్యజాతపులకామాలోక్య గండస్థలీం
లజ్జానమ్రముఖీప్రియేణ సహసాబాలాచిరంచుంబితా"

ఈపద్యమునందు అయిదుసారులు ల్యప్ప్రత్యయమును బ్రయోగించుట, రెండుసారులు, లోకధాతువును బ్రయోగించుట, శృంగార రసమునకు విరుద్ధమగు మహాప్రాణవర్ణములను బ్రయోగించుట మున్నగు లోపములఁ జూపుచు, రసాభివ్యంజకమగు కవిత్వ మెట్లుండ వలయునో తెలిపియున్నాఁడు.

మఱియు భక్తి, వాత్సల్యములకు రసత్వమున్నదా, లేదా, యను విషయమును జర్చించి, వానికి రసత్వము లేదనియు, నవిభావ ములే కావలయుననియు నిరూపించెను.

తుటియు భావధ్వనియందువలె, భావోదయాదిధ్వనులందును భావమే ప్రధానముగాని, ఉదయాదులు ప్రధానములుగావనియు, కేవల భావమే వ్యంగ్యమగునపుడు భావధ్వని యనియు, నుదయాద్యవస్థా విశిష్టమగు భావము వ్యంగ్యమగునపుడు భావోదయాది ధ్వనులనియు వివరించెను.

ఇక రసాభాసము రసమగునా, కాదా. యనునపుడు, హేత్వా భాసము హేతువుకానట్లు రసాభాసమును రసము కాఁజాలదనియు, నశ్వాభాసము నశ్వమయినట్లే, రసాభాసమును రసముకావచ్చు ననియు, రెండుమతములను సయుక్తికముగ నిరూపించెను. ద్రౌపదికిఁ బాండవులందుఁ గల రతి రసాభాసమగునా కాదా యను సందర్భమున, పరిణయముగాని బహునాయకగతమగురతి రసాభాసమగునుగాని, పరి ణేతృబహునాయకగతమగు రతి రసమే కావచ్చును. అని నిరూపించెను.

ఇక ద్వితీయాననమున నానార్థక శబ్దములు గల "సురభి మాంసంభక్షయ" అను తావులందు ప్రస్తుతార్థము, అభిధావ్యాపారము వలనను నప్రస్తుతార్థము, వ్యంజనావ్యాపారము వలనను సిద్ధించుచున్న వను ప్రాచీనమతము నిరూపించి, ప్రస్తుతాప్రస్తుతార్థములు రెండును నభిధవలననే క్రమముగ సిద్ధింపవచ్చును గాన నప్రస్తుతార్థమునకై యభిధకన్న వేఱుగ వ్యంజన నంగీకరింపఁ బనిలేదను నవీన మతమును జూపి, తాను స్వతంత్రముగ వ్యంజన నిట్లు నిరూపించెను.

"అబలానాంశ్రియంహృత్వా
వారివాహైస్సహానిశం
తిష్ఠంతిచపలాయత్ర
సకాలస్సముపాగతః"

స్త్రీల సొబగును హరించి మెఱుపులు మేఘములతోఁగూడి జరించుకాలము (వర్షాకాలము) వచ్చినది, అను ప్రస్తుతార్థము ప్రతీయ

మాన మయినపిమ్మట, దుర్బలుల ధనమును హరించి, చంచల స్వభావ ముగల స్త్రీలు, జలవాహకులగు పురుషులతో రమించెడి దుష్కాలము వచ్చినది. అను నప్రస్తుతార్థమిట ప్రతీయమానమై యీ పద్దెమునకు వన్నె పెట్టుచున్నది. ఈరెండవ యర్థము, యౌగికరూఢస్థలములం దప్రస్తుతార్థ మభిధచే సిద్ధింపదనుశాస్త్రసిద్ధాంతమునుబట్టి, యభిధచే సిద్ధింపదు. లక్షణాబీజమగు ముఖ్యార్థబాధాదికము లేనందున నిది లక్షణవలన సిద్ధింపదు. కాన నిట్టి తావులందు వ్యంజనావ్యాపారము నంగీకరింపవలయును.

మఱియు నీతఁడు

"సంయోగోవిప్రయోగశ్చసాహచర్యం విరోధితా...

శబ్దార్థస్యానవచ్ఛేదేవిశేషస్మృతిహేతవః"

నానార్థకశబ్దముల కీయర్థమునందుఁదాత్పర్యమను సందేహము కలిగినప్పుడు, సంయోగము మున్నగునవి ఇరువదినాలుగు ధర్మములు తాత్పర్యనిర్ణయమునకు సాధనములను ప్రాచీనమతమును నిరూపించి, అట మమ్మటాదుల మతముల విమర్శించి. తుదకు

"ప్రాయశోలింగభేదాప్వైతే ॥

నతతఃపృథగ్వ్యాఖ్యాతాః"

అని వీని నన్నిటిని లింగమునందుఁజేర్చి, లింగ మొక్కటియే తాత్పర్య నిర్ణయమునకు సాధనమని నిరూపించెను.

మఱియు లక్షణావృత్తిని నిరూపించునపుడు విలక్షణమార్గము నవలంబించి, రూపకమునందు "ముఖం చంద్రః" అను నెడ లక్షణ అవసరములేదు. "అత్యంతా సత్యపిహ్యార్థేజ్ఞానం శబ్దః కరోతిహి" అను నార్యోక్తినిబట్టి శాబ్దబోధకలుగవచ్చునను వారిమతమును నిరూపించి, రూపకమునందును సాధారణ ధర్మరూపమగు సాదృశ్యము బుద్ధిస్థము కానినాఁడు, "భారతం నాకమండలం" అని నప్పుడు రూపకము వ్యక్తము గాక,

"సుపర్వాలంకృతంభాతిభారతం నాకమండలమ్"

అను నెడ, సుపర్వాలంకృతత్వ మను సాధారణధర్మము బుద్ధిస్థమయినపుడే రూపకము సువ్యక్తమగుచున్నది. కాన సాదృశ్యము బుద్ధిస్థమగుటకు రూపకమునందును లక్షణ యవసరమని నిరూపించెను.

మఱియు రూపకమునందు, బింబప్రతిబింబభావము లేదనియు, వాక్యార్థవృత్తి రూపకము లేదనియును దీక్షితాదులమతము.

పండితుఁడు

"కందర్పద్విపకర్ణకంబుమలినైః దానాంబుభిర్లాంఛితమ్...
సుధాసహచరంబింబంకలంకాంకితమ్"

అను నెడ రూపకమునందును బింబప్రతిబింబ భావము కలదని నిరూపించెను.

ఇట్లే

"త్వత్పాదనఖరత్నానాం యదలక్తకమార్జనమ్
ఇదం శ్రీఖండలేపేనపాండురీకరణంవిధోః"

ఇట దీక్షితులు వాక్యార్థవృత్తినిదర్శన యనిరి. పండితుఁ డిట వాక్యార్థవృత్తి రూపకమనియు,

"త్వత్పాదనఖరత్నానియోరంజయతి యావకైః
ఇందుంచందనలేపేనపాండురీకురుతేహిసః" అనునది వాక్యార్థవృత్తి నిదర్శన కుదాహరణమనియు సవిమర్శముగ నిరూపించెను.

మఱియు సీత డుపమయందు శాబ్దబోధను నిరూపించునపుడు తార్కికశిరోమణి యగు రఘునాథుని శిరోమణి వ్యాఖ్యాను నిరసించియు, రూపకాలంకారమునందును దనవైశిష్ట్యమును జూపెను.

మఱియు నుత్ప్రేక్షాలంకారము నందు ఫలముధాత్వర్థమనియు ఫలానుకూల వ్యాపారము ప్రత్యయార్థమనియు, లఃకర్మణి త్యాది సూత్రమునందు 'కర్తరికృత్' అను సూత్రమునందలి శబ్దానుకర్షణగ నే చేయుదుమనియు, సత్ప్రధానానినామాని, అను వాక్య

మును బట్టి, భావప్రధానమాఖ్యాతమ్, అను వాక్యమునకు, ధాతువు భావనార్థకము, అనియే యర్థమును చెప్పవలయుననియు, అలంకార శాస్త్రము గూడ స్వతంత్రము గాన శాబ్దిక మతవిరోధమును బాటింప బనిలేదనియు నలంకార శాస్త్రమున కొక ప్రత్యేకతను నిరూపించెను.

మఱియు నలంకారాననమున బ్రాచీనులు చెప్పని యసమాలంకారమును ఉదాహరణాలంకారమును వేఱుగ నిరూపించెను. శ్లేషాలంకారమునకు, వివిక్తవిషయమును జూపి, శ్లేషాలంకారమున కలంకారాంతరబాధ్యత్వ, బాధకత్వ, సంకీర్ణత్వపక్షముల జక్కగ నిరూపించెను. సమాసోక్తియందు, ప్రస్తుతవృత్తాంతమునం దప్రస్తుత వృత్తాంతసమారోపముమాత్రముండును. రూపకమునందువలె ప్రస్తుత ధర్మియం దప్రస్తుతరూపసమారోపములేదను మతమును నిరసించి, సమాసోక్తి యందును ప్రస్తుత ధర్మియం దప్రస్తుతరూపసమారోపము నిరూపించెను. మఱియు బ్రాచీనులచే చెప్పబడిన దీపక, కారకదీపకముల దుల్యయోగితయందు జేర్చెను. సహోక్తి మున్నగునవి వేఱగు నలంకారములు గావనియు, లలిత మనెడి యలంకారమే లేదనియు, కావ్యలింగార్థాంతరన్యాసము లోకే యలంకార ప్రభేదములు కావచ్చుననియు నిరూపించెను. నిజమున కీతని రసగంగాధరమున నెక్కడ జూచినను ఏదేని యొక విశేషము గన్పట్టుచునే యుండును. తఱుచుగ నీత డప్పయ్యదీక్షితుల చిత్రమీమాంసమును గువలయానందమును నిరసించుచు వచ్చెను.

మఱియు నీతనికి బాండిత్యముతో బాటు కవిత్వము నతి మనోహరము. ఈవిషయము నతడిట్లు నిరూపించెను.

"ఆమూలాద్రత్నసానోర్మలయవలయితాదాచకూలాత్పయోధే
ర్యావంతస్సంతికావ్యప్రణయనపటవస్తేవిశంకంవదంతు

మృద్వీకామధ్య నిర్యన్మసృణరసఝురీమాధురీభాగ్యభాజా
వాచామాచార్యతాయాః పదమనుభవితుం కోస్తి ధన్యో మదన్యః"

చతుస్సముద్రముద్రితధరావలయమున వాగాచార్యపదము నందుటకు నాకన్న మిన్నయగువాఁ డెవఁడని తన కవితాప్రౌఢిని విశదీకరించెను.

మఱియు నీతెఁడు,

"నిర్మాణే యదిమార్మికోసినితరామత్యంతపాకద్రవ
న్మృద్వీకామధుమాధురీమదపరీహారోద్ధురాణాంగిరామ్
కావ్యంహంతసఖేసుఖేనకథయత్వం సమ్ముఖేమాదృశాం
నో చేద్దుష్కృతమాత్మనాకృతమితిస్వాంతాద్బహిర్మాకృథాః"

ద్రాక్షామధురమగు పదగుంభన మొనరింపగలుగుదువేని, నీ కావ్యమును మాకు వినిపింపుము. అట్లు కానినాఁడు నేను చేసినది దుష్కృతిముకాని, కావ్యముకాదని నోరుమూసికొనుమని తన కవితా పాండిత్యదర్పమును స్పష్టముగఁ బ్రకటించెను. ఈతని రసగంగాధర వైశిష్ట్యమున కింకొక నిదర్శనము కలదు. ఉత్తరదేశమునఁ గావ్యప్రకాశికకు గౌరవము మెండు. ఉత్కలదేశమున సాహిత్యదర్పణమునకుఁ బ్రచారము హెచ్చు. దక్షిణదేశమం దప్పయ్యదీక్షితకృతములగు చిత్రమీమాంస, కువలయానందముల కెక్కుడు గౌరవము. ఆంధ్రదేశమునఁ బ్రతాపరుద్రీయమునకు వాడుక మిక్కుటము. కాని రసగంగాధరమునం దెందఱ నీతడు దూషించినను, అన్ని దేశములందును నీతని రసగంగాధరము శిరోభూషణముగ నుండుటయే యీతని వైశిష్ట్యమును జాటుచున్నది. ఇట్టి పండితరాజునుగన్న యాంధ్రదేశము, అందును గోనసీమయు మిక్కిలి ధన్యములనుట కెట్టిసందియమును లేదు.

# ఉర్దూకవి - ఇక్ బల్

(కొ. శఠకోపం)

ఉర్దూభాషలోని ఆధునిక కవులలో 'ఇక్ బల్' మహాశయుడు అగ్రగణ్యుడు. ఈయన గొప్ప విద్వాంసుడు, తత్త్వశాస్త్రజ్ఞుడు అనియు ఖ్యాతిగాంచెను. ఈసందర్భమున ఉర్దూభాషనుగూర్చి కొంతచెప్పవలెను. ఈదేశపు 14 భాషలలో ఉర్దూకూడ చేరియున్నది; అట్లు మన భారత రాజ్యాంగంలోను పరిగణింపబడినది. 'ఉర్దూ విదేశీయము, తురకభాష' అని కొందరు భ్రమపడినారు. యదార్థమునకు అది సంస్కృతజన్యము లగు మన ఆర్యభాషలలో నొకటి. ప్రాచీనకాలపు ప్రాకృత భాషా శాఖలలోని ఆర్యావర్తబ్రహ్మావర్తప్రాంతపు శౌరసేని యపభ్రంశరూప మొందినది; ఇదే కాలక్రమమున పశ్చిమ హిందీగ పరిణమించినది. గ్రియర్సన్ మహాశయుడు తన Linguistic Survey of India లో దీనిని సహేతుకముగా నిరూపించెను. దీని నితర విద్వాంసులు నంగీకరించి నారు. హిందీభాషకు వాడుకలో మాండలికభేదము లేర్పడినవి. అందులో మీరటు, ఢిల్లీ, ఆగ్రా ప్రాంతముల శౌరసేనీభవమగు వాడుక భాషను "ఖడీ బోలి" యందురు. ఈప్రాంతము మహాభారతకాలమున కౌరవవంశీయరాజ్యమునకు, అంతట కాన్యకుబ్జమునకును రాజ్య కేంద్రమై నట్లే, పిమ్మట ముస్లిము చక్రవర్తుల పాలనములోను సామ్రాజ్య కేంద్రముగ నుండెను. వారిలో మొగలు చక్రవర్తుల పాలనలో అచటి రాజభాష పారసీ. అది సంస్కృతము కత్యంత సన్నిహితము, కాని పిమ్మట అరబ్బీ మిశ్రితమయినది. ఈ కేంద్రపు ఖడీబోలియను హిందీలోనికి పారసీపదములు చేరెను. అది ఈనాటి వాడుక తెలుగులో ఆంగ్ల పదము లెన్నియోదూరి యున్నట్లేగదా! ఇట్టి శైలిగలహిందీ ఆసామ్రాజ్యపు ప్రాంతీయ భాగ ములలోను జనులలో సహజముగ వ్యాపించెను. ఈభాష సైనిక శిబిర

ములయందెక్కువ వాడబడినందున, దీనికి 'ఉర్దూ' (అరబ్బీలో=శిబిరం) అని వాడుకపేరు కలిగెను. దీని పారసీలిపిని ఉర్దూ లిపి అందురు. దీని శాఖయే "దక్కను"లోని గోలకొండ ముస్లిమురాజ్యములోను పిమ్మట నిజాము రాజ్యములోను రాజభాషగనుండినది. కనుక, ఆంధ్రు లనేకులు ఇది తురకభాష, విదేశీయము అని పొరబడుచుందురు. ఒక భాష స్వభావమును అందలి సాహిత్య పారిభాషికపదములనుబట్టి కాక, పామరజనుల దైనికచర్యల పదజాలములను, ముఖ్యముగ అవ్యయము, సర్వనామము, క్రియలు, అంకెలు ఇత్యాదులనుబట్టియే నిర్ణయించుట యుక్తము. భాష కివియే ప్రాణమనదగినవి. ఈపంచప్రాణములకు హిందీ, హిందూస్తానీ, ఉర్దూలలో ఒకే పదములుండును. కనుక భాషాశాస్త్రరీత్యా ఈ మూడును ఒకేహిందీభాషకు భిన్నశైలులనదగును. హిందీ దేవనాగర లిపిలోను, ఉర్దూ పారసిలిపిలోను వ్రాయబడును. సంస్కృత విద్వాంసులు హిందీకావ్యములను నాగరలిపిలో సంస్కృతపదభరితముగ వ్రాయగా, పారసీవిద్వాంసులు ఉర్దూ కావ్యములలో ఉర్దూలిపిని పారసీ పదములను హెచ్చుగ వాడిరి. వారల కవి సమయమును అలంకారిక సంప్రదాయమును సహజముగ కొంత భేదించినవి. ఈరీతిగ బాహ్యభేదములు పెరిగి, హిందీ ఉర్దూలు వేర్వేరుభాషలను భావము స్థూలదృష్టివల్ల కొందరు విద్వాంసులలోనుకల్గినది. కాని సామాన్యజనుల భాషనుపరికించగా హిందీ ఉర్దూలు రెండును ఒకేభాషకు ఆకారభేదములని తెలియగలదు. ఈరెంటికి మధ్యరకపుభాషను హిందూస్తానీ అనుటకలదు. పారసీలో "హింద్"అనగా భారతదేశము. ఈదేశపు భాష అనుటకు "హిందీ" శబ్దమును వాడిరి. దీనినే ఇప్పుడీ దేశపు రాజ్యభాషగజేయ స్థిరపరచినారు. పంజాబు, ఢిల్లీ ఆగ్రాలలోనేగాక గోలకొండ హైద్రాబాదు ఇత్యాదులలోను రాజాదరణ వలన ఉర్దూ సాహిత్యమునకు గొప్పప్రోత్సాహ మేర్పడినది. 19 వ శతాబ్దిలో గాలిబు, హాలీ, అక్బరు మున్నగు [illegible] ఉర్దూలో [illegible]

సాహిత్యమును సృజించిరి. వీరు ముస్లిములే. కాని సంకుచిత దృక్పథముతో కాక విశాల జాతీయభావముతోనే, ఉర్దూ సాహిత్యము నలంకరించిరి. వారి తరువాత ఇక్బలు నాయకమణిగ అద్భుతరచనల రచించెను. కాని జాతీయ భావపుదృష్టిలోను వచన శైలీతీక్ష్ణతలోను మౌలానా అబుల్ కలాం అజాదు (కేంద్రవిద్యామంత్రి) ఇక్బలు నతిక్రమించెను. చాలమంది హిందువులును ఉర్దూలో మంచి గ్రంథములురచించి, భాషాసేవ చేసియున్నారు, చేయుచున్నారు. "ఇక్బల్" అనగా పారసీలో ఒకేమహాశక్తి (సం. ఏకబల్) అని అర్థము. ఈయన పూర్వికులు ప్రథమంలో కాశ్మీరవాసులు, బ్రాహ్మణులు, విద్వాంసులును. కాశ్మీరము హిందూసంస్కృతి కొకప్పు డాలవాలముగనుండెను. ఎందరో పూర్వసంస్కృతకవులు కాశ్మీరవాసులు. కాని ఆప్రాంతమున మధ్యకాలమందు ముస్లిం పారసీల దాడి, ఒత్తిడి హెచ్చినవి. చాలమంది కాశ్మీరబ్రాహ్మణులప్పుడు స్వమతరక్షణకై ఆప్రాంతమును విడచిరి. నెహ్రూ, సప్రూ, కట్జూ ఇత్యాదులపూర్వీకులు అప్పుడిళ్లే యమునాగంగాతీరముల జేరిరి. ఇక్బలు పూర్వీకులును కాశ్మీరు విడిచి దక్షిణాభిముఖులైరి. కాని వారుపంజాబుమధ్యనే నిలిచిపోయిపిమ్మట ముస్లిం మత మవలంబించిరి. ఇక్బలు తండ్రియగు షేక్ నూర్ మహమ్మదువిద్వాంసుడు, వ్యాపారస్థుడును. అచటి "సయాల్‌కోట"పురమున ఇక్బల్ 1873 సం॥న జన్మించెను. ఈతడు బాల్యమునుండి ధీమంతుడు విద్యాసక్తుడునై శ్రద్ధాభక్తులతో అచటి స్కూలులో శిక్షణబొందెను, పిమ్మట పంజాబుకు ముఖ్యనగరమగు లాహోరులోని ప్రభుత్వ కళాశాలలలో ఉన్నత విద్య నభ్యసించెను, ఉర్దూతోబాటు పారసీ అరబ్బీలందును చాల అభిమానముగలిగి త్రిభాషాభిజ్ఞుడై అందలి సాహిత్యమును గ్రోలెను, అంతట ఆర్నల్డు అను ప్రసిద్ధ ఆంగ్లవిద్వాంసునియొద్ద తత్వశాస్త్రమును నేర్చుకొని అందు ఎం. ఏ. బిరుదమొందెను. వెంటనే అచటి ప్రభుత్వకళాశాలలో ఆతని కుద్యోగము లభించెను. కాని దర్శన

శాస్త్రము నింకను గ్రోలి పారంగతుడగు కాంక్షతో ఇక్బలు అయుద్యోగమును వదలి, ఇంగ్లండుకేగి అచటి విజ్ఞానకేంద్రమగు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో చేరి అచట దీక్షతో కృషిచేసి పాశ్చాత్య దర్శనము (Philosophy) లో మంచి ప్రవీణుడాయెను. అప్పుడాయన లండనులో న్యాయశాస్త్రమునుగూడ చదివి బారిస్టరు పట్టమునుగూడ సంపాదించెను. యూరపులో జర్మనీలోని "మ్యూనిక్" విశ్వవిద్యాలయమప్పుడు దర్శనశాస్త్రబోధనకు ప్రసిద్ధిజెంది యుండెను. కనుక జర్మను భాష బాగుగ నేర్చుకొని ఇక్బలు ఆవిశ్వవిద్యాలయములో చదివి అచట మంచి స్వతంత్ర పరిశోధనలనుగూడ చేసెను. పారసీక తత్వశాస్త్రమును ఆయన పాశ్చాత్యదర్శనములతో బోల్చి, విమర్శించి, గొప్పగ్రంథమును వ్రాసి, అందుకక్కడ పి. హెచ్. డి. బిరుదమంది తన పాశ్చాత్యవిద్యాశిక్షణను పూర్తిచేసికొని మరలి వచ్చెను.

స్వదేశమును చేరగనే ఆయన పాండిత్యమును బట్టి లాహోరులోని సర్కారు కళాశాలలో ఆయన తత్వశాస్త్రాధ్యాపనాచార్యుడుగ నియమింపబడెను. ఇది తనకిష్టమైనది, గౌరవప్రదమును. కాని మన దేశమంతట విద్యావంతు లందరిలో అప్పుడు (1908) జాతీయతా తరంగములు వ్యాపించుచుండెను. పాలు, లాలాజీ, తిలకు అరవిందుడు మున్నగు విద్వాంసులును అధ్యాపకతను వదలి, అప్పుడు వార్తాపత్రికలకు సంపాదకులై, తీవ్రజాతీయోద్యమము నడపు చుండిరి. తానును అట్లే చేసి యథాశక్తిగ సంఘమునకు సేవచేయ దలచి, ఇక్బలు ప్రభుత్వోద్యోగపు శృంఖలములను తెంచుకొని స్వతంత్రతకై లాహోరు హైకోర్టులో న్యాయవాద వృత్తి నవలంబించెను. స్వేచ్ఛకొరకిట్లు బారిష్టరుగ పని చేసినను, ఆయనమనస్సు సాహిత్యమునందే లగ్నమగు చుండెను. అచటి ప్రజానీకపు సాహిత్యభాషయగు "ఉర్దూ" అను హిందుస్తానీలో ఇక్బలు చక్కని గీతములనువ్రాసి పత్రికలలో ప్రచురించుచుండెను. ఆయా

నైతిక సార్వజనిక సమస్యలగూర్చి పటుశైలిలో వ్యాసములనుగూడ ఆయన వ్రాయుచుండెను. అప్పుడాయన వ్రాసిన రచనలు ఉదార భావములతోనుండి, శైలిలో కొంతవరకు నారికేళపాకములోను కొంత ద్రాక్షాపాకములోను నడచుచుండెను. భావములు గంభీరములైనందున జనాదరమును పొందుచుండెను. క్రమముగ ఉర్దూ సాహిత్యరంగములో ఇక్‌బలు అగ్రగణ్యుడాయెను. ఆయన దృఢభావములు విశాలములై సాంఘికమూఢాచారములను నిరసించుచు, సాంఘికమైత్రికి జాతీయోన్నతికిని జనులను పురికొల్పుచుండెను. ఆయన పారసీలోను మహాకవియై పారసీసాహిత్యమును గూడ వృద్ధిచేసెను. ఆయన రచనలలో కొన్ని ఇంగ్లీషులోనికనువదింపబడి, ఇంగ్లండులో ప్రచురింపబడి, యూరపులోని విద్వాంసుల మన్ననల నొందినవి.

అప్పుడు ఉత్తరదేశపు బెంగాలులో రవీంద్రనాథ టాగోరును పంజాబులో ఇక్‌బలును సాహిత్యాకాశమున మహాజ్యోతులై వెలిగిరి. కనుక ఈ యిద్దరిని పోల్చి వీరల సామ్యభేదములను గమనింతము. ఈ మేధావులు ధీరులై తమమాతృభాషలయందే స్వతంత్ర రచనలను చేయుచుండిరి. అవి యచటి విద్వాంసుల మన్ననల నొందుటయేగాక, ప్రజాదరమును బొంది, సామాన్యజనులలోను గొప్ప సంచలనమును గలిగించినవి; జన జీవితములో కొంత పరిణామమునకును కారణమైనవి. ఉభయులును సాహిత్య జీవితమును గడిపి, మన దేశీయభాషల సాహిత్యమునున్నతికి తెచ్చిరి. ఇద్దరి రచనలలో కొన్ని ఆంగ్లభాష కనువదింపబడెను. వెంటనే పాశ్చాత్య సాహిత్యకులలోను ఈ భారతీయకవులిద్దరికీని పేరుప్రతిష్ఠలు హెచ్చినవి. మనదేశభాషలందు సాహిత్యసేవచేసినందుకు ప్రభుత్వాదరణకలుగుట ఆ కాలమందు కష్టముగ నుండెను. కాని వీరి యద్భుత ప్రతిభకుమెచ్చిన బ్రిటిషు ప్రభుత్వమువారు విశ్వకవి

రవీంద్రునికి ఈ ఇక్‌బలుకు కూడ- 'సర్' బిరుదమిచ్చి యాదరించిరి. ఈ యిద్దరును కవిప్రవరులేగాక ప్రముఖదార్శనికులు, దైవభక్తులును; మరియు తాత్త్వికులైనను వేదాంతచర్చలతోనే సరిపెట్టుకోక సామాన్య జనుల జీవిత సమున్నతికి ప్రజల నుద్ధరించుటకు ఈ మేధావులు ఉభయులును తమ లేఖినినిస్వేచ్ఛతో వినియోగించి, జనజీవితములో పరిణామము గల్గించిరి. ఉభయులును జాతీయవాదులుగ నుండిరి. వారి జాతీయగీతములు దేశమంతట మాన్యతనొందినవి. (ఉ॥ రవీంద్రుని 'జనగణ మన'; ఇక్‌బలు 'సారే జహాన్ సే అచ్ఛా హిందూస్తాన్ హమారా'.) ఉభయులు జనులలో వ్యాపించిన మూఢవిశ్వాసములను మాంద్యమును తమ రచనలలో నిరసించి జనులను ఉద్యమపరులు కమ్మని (చాలవరకు కాంతా సమ్మితముగనే) తమ రచనల ద్వారా ప్రేరణచేసిరి. ఉభయులు తీవ్రవాదులగు యువక క్రాంతికారుల హింసా దృక్పథమును నిరసించిరి. ఇక నీయిద్దరి మధ్యభేదమును గమనింతము. రవీంద్రుడు మనప్రాచీన శ్రుతిస్మృతుల ధోరణినిబట్టి ఆగాథల నెక్కువగ నుపయోగించెను. ఇక్బలు పారసీ ప్రాచీన గ్రంథములను అందలిగాథలను వినియోగించెను. రవీంద్రుడు హిందూ వేదాంతమున కెక్కువ ప్రాముఖ్యమునిచ్చెను. ఇక్‌బలు ముస్లింమతపు సూఫీ సిద్ధాంతమును సంప్రదాయమును జనులలో వెదజల్లెను. రవీంద్రుడు తన రచనలలో సంస్కృత పదజాలము నద్భుత నైపుణ్యముతో వినియోగించి బంగాళీనేగాక తద్వారా మన మాతృభాషలన్నిటిని ప్రభావితము చేసెను. ఇక్‌బలు ముస్లిము సంప్రదాయకుడగుటయే గాక, ఉర్దూలోనే వ్రాయుచు పంజాబులోని ముస్లింజనానీకముతోనే సంపర్కము కలిగియుండెను.

ఇక్‌బలు తాత్త్విక పరిశోధనలకై సంస్కృతభాషను హిందూ దర్శన గ్రంథములనుగూడ అభ్యసించి వేదములందలి గాయత్రి గీతలు, మరికొన్ని ధార్మిక గ్రంథాలను ఉర్దూ పారసీలలోని కనువదించి ముస్లిం

లోకమున కందజేసిరి. కాని పారసీ అరబీ సంప్రదాయములు ఆయన సాహిత్య రచనలకు ముఖ్యాధారములనదగును. యూరపులోని సాహిత్య వృత్తులను ఆయన సమన్వయించెను. ఆయన రచనలలో పారసీ అరబ్బీ పదములు వారి కవి సమయములును హెచ్చుగ నుండును. పారసీ జ్ఞానములేనివారికవి సుబోధములుకావు. కనుక ఇతరులలో అంతగా వ్యాపించలేదు. పిమ్మట వీరిద్దరును వేరు వాతావరణములకు లోనై భిన్న ప్రవృత్తుల నవలంబించిరి. రవీంద్రుడు గొప్ప దేశ భక్తుడు విశ్వజనీనుడునై బ్రిటిషువారి క్రూర దమననీతిని ఖండించి అందుకై తన సర్ బిరుదును వదలు కొనిరి, దేశీయ కళాశిల్పములను జాతీయ విధానములను బలపరచిరి; శాంతి నికేతనమును ఆదర్శరూపముగా నడిపిరి, మత సామరస్యమునకే తమ శక్తినంతను వినియోగించిరి, ప్రత్యక్ష రాజకీయ చర్యలలో మాత్రమెప్పుడును పాల్గొనలేదు. కాని ఇక్‌బలు క్రమంగా 1926 సం॥ నుండి శాసన సభ్యులై పంజాబులోని ముస్లిం సాంఘిక వాదపు ప్రభావమునకు గురియైరి. 1930 సం॥ రౌండు టేబిలు సభలో సభ్యులై ముస్లింకూటపు భావముల ననుకరించిరి. తన అంత్యవత్సరములందు ఆయన ముస్లిముల సాంఘిక సంస్కృతి రక్షణకని ముస్లింజనాధిక్యపు ప్రాంతమునకు ప్రత్యేక ప్రభుత్వమేర్పడి అట్టి రక్షణకై విశిష్టాధికారపు ప్రభుత్వముండవలెననిరి. ఇది "పాకిస్తాను"కు బీజమని, కనుక పిమ్మట వచ్చిన పాకిస్తాను ఉద్యమమున కాయనయే బీజము నాటెననియు కొందరన్నారు. ఇందులో కొంత సత్యమున్నది. ఉత్తరదేశములో హిందూ ముస్లిములమధ్య విభేదము లప్పుడు పెరిగి వారలసాంఘిక రాజకీయ జీవితములను కలుషితము చేసినవి. కనుక ప్రాంతీయప్రభుత్వములో ప్రాంతీయ సంస్కృతికి ప్రాబల్యముండదగునని కోరి అందు కాయన 'పాకిస్తాను' పేరును వాడిరి. కాని దేశమిట్లు విచ్ఛిన్నమై సంబంధములేని వేరు రాజ్యము లగునట్టి స్వతంత్ర పాకిస్తాను నాయన కోరలేదు. ఆయన

1938 సం॥లో మరణించిరి. 1940 సం॥లోనే మొదటిసారి రాజకీయముగ "పాకిస్తాను" వాదము అంకురించి, 1947 సం॥లో ఆచరణ ప్రాముఖ్యము నకు వచ్చినది.

రమారమి 40 ఏండ్లు నిరంతరదీక్షతో సాహిత్యసేవ చేసి ఇక్‌బలు వ్రాసిన గీతకావ్యములు వ్యాసములు శాస్త్రగ్రంధములు ఇత్యాదులు చాల సంపుటములుగ ప్రచురింపబడినవి. ఇందులో కొన్ని ఇతర భాషలలోని కనువదింపబడినవి. ఇతర ఉర్దూకవులవలె కేవలము శృంగారరూపమగు 'గజల్' గీతములను ఇక్‌బలు అంతగా వ్రాయలేదు. ఆత్మానందమును విశ్వప్రేమను దద్యానుభూతిని తెలుపు సూఫీ మతాను సారియగు రచనలను తాత్వికభావగర్భితమగు వాటినిగూడ చాల రచించెను. ఇట్టి గీతసంపుటులలో 'బాంగోదరా' అనునది ఎక్కువ ప్రసిద్ధము. వీటిలో ఇక్‌బలు భావములు ఉదారములు, గంభీరములు, ధ్వనియుతములు, నిర్మాణాత్మకములుగ నుండును. కొన్ని ఈ క్రింద చూపబడినవి.

హిందూస్తాన్ హమారా

సారే జహాన్‌సే అచ్ఛాహిందోస్తాన్ హమారా । హమ్ బుల్‌బులే హైం
ఇసీకే, యహ్ గులిస్తాన్ హమారా
గుర్‌బత్ మేంహో అగర్ హమ్ రహతాహై దిల్ వతన్‌మేం, సమఝో
వహీ హమేభీదిల్ హో జహాం హమారా ।
పర్వత్ యహ్ సబ్ సే ఊంచాహమ్ సాయాం ఆస్‌మాన్ కా
వహ్ సంతరీ హమారా వహ్ పాస్‌బాన్ హమారా ।
గోదీమేంఖేలతీహైం ఉస్‌కీ హజారోం నదియాం ।
గుల్‌శన్ హై జిన్ కే దామ్ సేరస్కే జినాహమారా ।
మజహాబ్ నహీం సిఖాతా ఆపస్‌మేం బైర్ రఖనా

హిందీహై హమ్, వతన్ హై హిందూస్తాన్ హమారా
యూనానో మిస్రోరూమా సబ్ మిట్ గయే జహాఁసే
బాకియబీ హై అబ్ తక్ నామోనిశాన్ హమారా
కుఛ్ బాత్ హైకిహస్తీ వహీ మిటతీనహీ హమారా
సదియోం రహా హై దుశ్మన్ దౌరే జమాన్ హమారా
ఇక్బల్ కో ఈమహరమ్ అపనా నహీ జహాన్ మేఁ
మాలుంక్యా కిసీకో దర్దేసి హాఁ హమారా

భావార్థము : లోకమంతటిలో మన హిందూస్థానమే ప్రశస్తము. మనమందర మందలికోయిలలము. అది మన గులాబీతోట. మనము విదేశములందున్నను మన హృదయము స్వదేశముపైననే యుండును, హృదయమున్నచోటనే మన మున్నట్లుగదా. సర్వోన్నతమగు మన నగము ఆకసము నంటును. అది మనకా పరి, పార్శ్వవర్తి. ఈమహాదేశపు ఒడిలో వేల నదులు ఆడుచుండును. వాటి వంద్రమతో ఈదేశము ఆకర్షకమగు ఆరామమయినది. ఈ గంగా తీరమునకు మన (పూర్వపు) యాత్రాదళ మేనాడు చేరెనో! అంతఃకలహములు పెట్టుకొమ్మని మతము నేర్పదు. మన మందరము హైందవులమే. హిందూస్థానం మనదే. గ్రీసు, ఈజిప్టు, రోముల గొప్పసంస్కృతులు అంతరించిపోయినవి. కాని మన పేరే నేటికిని నిలిచియున్నది. మన ఘనత నశించేదికాదు. శతాబ్దులకాలది శత్రువులు వచ్చి తిరిగినను సరే; మనలో విభేదము లుండుటను ఇక్బలు సహింపడు. కష్టకాలములలో మన సహిష్ణుత ఎంత గాఢమో తెలియునా!

'హిమాలయగీతం' లో చరణం.

అయే హిమాలయ్ ఏపసీతే హిందూస్తాన్,
చూమతాహై తేరీ పేశాన్ కో ఝుక్ కర్ ఆసమాన్
(=ఓ హిమాలయమా హిందూస్తానపు దుర్గప్రాకారమా అహో ఆకాశము వంగి నీనుదురును చుంబించుచున్నదిగదా!

'నయా శివాలా' (నవ్యశివాలయం)

సచ్ కహేఁదూం ఏ బ్రాహ్మణ్ గర్ తూ నమానే,
తేరేసనమ్ కధేకే బూత్ హోగయే పురానే
అపనోంసేబైర్ రఖనా తూనే బూతోంసే సీఖా
జంగో జదల్ శిఖాయా వాయిజ్‌కో భీ ఖుదానే
పత్థర్‌కీహీ మూర్తిమేం సమఝా హై తూ ఖుదా హై
ఖాకే వతన్ కా ముఝుకో హర్‌జర్రా దేవతా హై
సూనీపడీహుఈ హై ముద్దత్‌సే దిల్‌కోబస్తీ, ఆ ఇక్ నయా శివాలా
ఇస్ దేశమేం బసాదే, హర్‌సుబహ్ ఉఠ్ కే గాయే మంత్రలే
మీఠే మీఠే సారే పుజారియోంకో, మయపీతకీపిలాదే,
శక్తిభీ, శాంతిభీ భక్తోంకే గీత్ మేంహై
ధరతీకేవాసియోంకో ముక్తిభీపీతిమే, హై॥

(ఓ బ్రాహ్మణా, నీవు తప్పు పట్టకుంటే నిజం చెప్పివేతును. నీ గుడిలో విగ్రహములు పాతగిలిపోయినవి. వీటినుండి ఇతరవారితో విరోధపడుటను నీవు నేర్చుకున్నావు. ముస్లిములలో భక్తుడును కయ్యముకు కాలుదువ్వుటనే తానారాధించు దేవునుండి నేర్చుకొనెను. శిలా విగ్రహంలోనే దేవుడున్నాడని నీవు భావించితివి. దేశపు ప్రతి మట్టి కణంలోను నాకు దేవుడు కనబడును. కాలక్రమమున సుహృద్భావము శూన్యమయినది. ఈ దేశములో వచ్చి ఒక క్రొత్తశివాలయము నెలకొల్పుము. ప్రతి ఉదయం లేచి ఈమధుర మైత్రీమంత్రమును పాడుము. పూజారులందరిచేతను ఈప్రీతి రసం త్రాగించుము; ఈ భక్తిగీతముతో శక్తి, శాంతి, ముక్తి కూడ, జనులకు కలుగును.)

ఇక్‌బలు కొలది యుపన్యాసములు తప్ప దాదాపు తక్కిన రచనలన్నిటిని పద్యములుగనే వ్రాసెను. ఇందువలన ఆయన దార్శనిక భావములను సిద్ధాంతములును సరిగా నిర్ణయించుట కొంత కష్టమయినది.

...cerabad ... 027

గీత పద్యములలో సహజముగ భావావేశము హెచ్చు. తెలుగులో వలె హిందీ ఉర్దూలలోను గీతకవులు 'భావకవిత్వ' మవలంబించిరి. ఇట్టి కవిత్వములో భావావేశమున్నను, అందలి ఆశయము సువ్యక్తము కాదు. ఆత్మానందమే అట్టిరచనల యుద్దేశమందురు; కవిత్వ రచనయు గొప్పకళ; కళాభివ్యక్తియే దాని ఆశయమనుటయు కలదు. **(Art for Art's sake)**. ఇవి తరుచు మాధుర్యభరితములు, ఒకప్పుడు కరుణావ్యంజకములుగను ఉండును. 'ఆనందో బ్రహ్మ'; కనుక కవి ఆత్మానందముకే గీత కావ్యములు వ్రాయుట సహజము కావచ్చు. తులసీదాసువంటి కవిశ్రేష్ఠుడు గేయరూపములో తన రామచరితమానస్ అను (హిందీరామాయణము)ను వ్రాయుచు, అందుకు కారణము "స్వాంతస్సుఖాయ" అని వ్రాసుకొనెను గదా. * ఇక ఈనాటి 'ఛాయావాది' 'రహస్యవాది' కవులు అట్టి కారణము చెప్పుటలో ఆశ్చర్యములేదు. ప్రేయసి నుద్దేశించి శృంగార రసభరితముగ 'గజల్'గీతములు ఇదివరలో ఉర్దూలో కుప్పతిప్పలుగ రచింపబడినవి. కాని 18, 19వ శతాబ్దులలో గాలిబు, హాలీ, అక్బరు మహాకవులీ సంప్రదాయమును మార్చిరి. వారు ఉదార దార్శనిక భావములను సామాన్య జనులలో వెదజల్లుటకు గీతములు రచించిరి. కావ్య రచయితలనే కవులని యీకాలమం దనుచున్నాము. కాని ఆర్ష కాలమున కవి శబ్దమును తత్త్వవేత్త, భగవానుడు అను నర్థములను వాడిరి. ఉ॥ కామ్యానాం కర్మణాంన్యాసంసన్యాసంకవయో విదుః. కవిపురాణ మనుశాసితారం (భ. గీత). పురాణస్యక వేస్తస్యముఖాద్వ్యగప దుత్థితా (రఘువంశం). కనుక ఆదిమకవులగు వ్యాస, వాల్మీకి, అశ్వఘోష, కాళిదాస కవులు దార్శనికులుకూడ నగుట యుక్తమే. శ్రీహర్షుడు నట్టివాడే. కాని పిమ్మట ఆధునిక కవులు ఈసంప్రదాయ మవలంబించుట అరుదయినది. కనుక, కవి కవియే, దార్శనికుడు దార్శనికుడే, అను భావ

---

* స్వాంతస్సుఖాయతులసీ రఘునాథవృత్తం భాషానిబద్ధమతిమంజుల మాతనోతి.

మేర్పడినది. రవీంద్రుడు ఇక్బలువలె గొప్ప దార్శనికుడయినను, కేవలం కళాప్రధానమగు మధురగీతముల నెన్నిటినో యువకదశలో రచించి జనుల నానందముగ్ధులుగ జేసెను. రవీంద్రుని వ్యాసములు, నవలలు, నాటకములు, కథలు ఇత్యాదులు రసాత్మకములు, కళాపుంజములుగ నుండును. ఇక్బలు రచనలలో నట్టివి లేవు. ఇక్బలు కావ్యరచనలును వీరేశలింగకవి రచనలవలె హితబోధకములు, తాత్వికాశయములు గల్గి యుండును. ఇక కేవలం తాత్వికోద్దేశముతో వ్రాసినవి ఇంకను హెచ్చు.

ఇక, ఇక్బలు తాత్వికభావములను కొంత పరిశీలింతము. ఆయన ప్రాచ్య పాశ్చాత్యదర్శనములను కూలంకషంగా పరిశోధించిన విద్వాంసుడు, కనుక, తౌలికతత్త్వము (comparative philosophy) నందు కొని విమర్శించుచుండెను. పాశ్చాత్యుల కేవల భౌతికవాదము (materialism) విజ్ఞాన (science) సహాయమున వారి నాగరిక ప్రాబల్యము (cultural domination) కును, భౌతికాధికారము ద్వారా రాజకీయాధిక్యము (political superiority)కును, సాధకమయినదని ఆయన గుర్తించెను. అందులోని విజ్ఞానాది సుగుణముల నవలంబించవలెనని పాఠకులను తరుచు ప్రోత్సహించెను. కాని మొత్తంమీద పాశ్చాత్య సంస్కృతిని గుడ్డిగ ననుసరించుటను తీవ్రముగ నిరసించెను. అట్టి అంధానుకరణవల్ల ప్రాచ్యజనులు పతితు లగుదురని అయన భావన. *ఆయన బ్రౌనింగువలె కేవలాశావాది (optimist) కాడు. అట్లని, స్కోపెన్‌హార్వరువలె నిరాశావాది (pessimist)యు కాడు. ఆయన 'యధాతథవాది' (realist) అనవచ్చు; అట్లని అదర్శవాదము (idealism) ను విడచుటయులేదు.

ఇక్బలు ప్రాచ్యదర్శనములలో బౌద్ధదర్శనముకు వ్యతిరేకి యనవచ్చును. అహింసా శాంతివాదము లాయనకు నచ్చలేదు. నాస్తిక

* తుమ్హారీ తహజీబ్ అపనే ఖంజర్ సే ఆప్‌హీ ఖుద్ కుషీ కరేగీ
జో శాఖే నాజుక్ పె ఆశియా బనేగా నాపాయదార్ హోగా ॥

విజ్ఞానవాదము లాయనకు గిట్టవు. ఇక హిందూమత సిద్ధాంతములలోను కొన్నిటి నాయన తీవ్రంగా విమర్శించెను. దృశ్య ప్రపంచమంతయు మిథ్య లేక మాయ అను అద్వైతసిద్ధాంతమును ఇక్‌బలు ఒప్పుకోలేదు; నివృత్తి మార్గమును నిరసించెను. ఐహికప్రపంచము దుఃఖమయమనియు, కనుక ఆముష్మిక మోక్షమునకే జీవుడు యత్నింపవలెనను భావములనుగూడ ఆయన గట్టిగ ఖండించెను. ప్రతి మానవునిలో ఒకేరీతి ఆత్మ కలదని ఆయన యంగీకరించెను ; కాని ఆయాత్మ స్వరూపమునుగూర్చి శంకరాదులనుండి భేదించెను. జీవాత్మకు ప్రత్యేక వ్యక్తిత్వమున్నది ; కష్టించి యాత్మవికాసమునకై మానవులందరు తీవ్రశ్రద్ధతో నిరంతరం కృషి చేయుచుండవలెను. ఈశ్వరుడను పరమాత్మకు నరుడు భక్తుడయినను, జీవాత్మ ప్రత్యేక వ్యక్తిత్వముతోబాటు వికాసస్వేచ్ఛను అభ్యుదయ బాధ్యతను గల్గియున్నాడని ఇక్‌బలు ఆశయము.

మానవుని గమ్యమును లక్ష్యమును ఏకాంతమోక్షము కాదు; కనుక మనము పరిసరములతో సంబంధము నేర్పర్చుకొని అందలి కష్టసుఖములలో భాగస్వాములమయి, సత్కామనలు కలిగియే ఉండవలెను. విజ్ఞానము (Science) ఉపకారియేకాని, భౌతిక విజ్ఞానపు మనశ్శక్తికి ఆత్మజ్ఞానపుశక్తిని మిళితముచేయ వలెను. లేనియెడల అది చాల హానికరము, సంస్కృతి విధ్వంసకమును అగును. మరియు కేవల జ్ఞానమార్గము శ్రేయస్కారి కాదు.† 'ఉత్తిష్ఠత జాగ్రత' అను హెచ్చరింపును ఆయన చేయు చుండెను.* జ్ఞానార్జనతో బాటు, నరుడు నిరంతరం

† జో అకల్ కాగులామ్‌హో, వోదిల్‌నకర్ కబూల్ (బాలే-జి బరీల్)

* బతా క్యా తేరీ జిందగీ కా హైరాజ్। హాజారోం బరస్‌సేహై తుమ్ ఖాక్ బాజ్। ఇసీ ఖాక్ మేం దబ్‌గయీ తేరీ ఆగ్, సహార్ కా అర్జాం హోగయీ, అబ్‌తో జాగ్ ॥ (బాలే- జి బరీల్)

ప్రగతి కరమగు కర్మలను చేయుచుండవలెను. ఆత్మోన్నతికిని సాంఘి కోన్నతికిని గూడ ఇహాపరసాధకమగు కర్మలన్నిటిని దీక్షతో చేయుట మానవుని విధ్యుక్త ధర్మము.

ఇక్‌బలు ముస్లిం మతావలంబియేగాక ఇస్లామునందు గాఢాభి మానియును. 'ఇస్లాము' అను పదమునకు 'శాంతి' అని యర్థము. అయి నను, ఇక్‌బలు తనరచనలలో అశాంతిని, ఉద్యమపరతను, కార్యోత్సా హమును ప్రేరించును; కొన్నిచోట్ల జనులను ఉద్రిక్తులుగ, ఆవేశపరులుగ గూడ జేయును. స్వజాత్యభిమానమున కాయన ప్రాముఖ్యమిచ్చెను. జనులు దీన మానవులందు ప్రేమగల్గియుండవలెనని, ఏకేశ్వర ప్రేమతో బాటు నరులందు సౌహార్దము కల్గియుండుట ధార్మికలక్షణమనియు, బీదల నుద్ధరింపవలెననియు, ఇక్‌బలు తన రచనలలో కొన్నిటిలో చెప్పెను.§ కాని రవీంద్రుడు, రాధాకృష్ణగారలలో నున్నంత చక్కగను విశదము గను విశ్వజనీనతయు, సర్వమానవసౌభ్రాత్రమును, ఇక్‌బలు రచనలలో ప్రముఖముగ లేవని తోచును.

ఏకేశ్వరునందు భయభక్తులు కల్గియుండవలెనని ఈ దార్శనికులు ముగ్గురును తమ రచనలలో ప్రబోధించినారు. ఇతరులందు కేవలం నిర్భయంగా వర్తించవలెనని సాహసంతో తన కర్తవ్యమును నెరవేర్చు టకు తలపడి కార్యసాధన చేసుకొనవలెననియు ఇక్‌బలు తక్కినవారి

---

* ఖుదా తుఝేకిసీ తూఫాన్ సే ఆశ్నాకర్ దే। కి తేరే బహ్‌ర్కీ మౌజోంమేఁ ఇజ రాబ్ నహీ॥

§ ఉఠో, మేరీ దునియాకే గరీబోంకో జగాదో
కాఖే ఉమరాకే దరో దీవార్ హిలాదో। జిస్ ఖేత్ సే దహాకాఁకో
మయస్సర్ నహీఁరోజీ, ఉస్ ఖేత్ కే హర్ ఖోశయేగన్‌దుమ్‌కో జలాదో॥

(బాలాజి బరీల్)

కన్ను దృఢముగనేగాక పదేపదే ప్రబోధించెను. * అందువల్ల అహింసా తత్వము కాయన రచనలలో తావు తక్కువ. మరియు సహనము కావ లెనని ఇక్‌బలు కొలదిచోట్ల చెప్పినను, మొత్తంమీద ఆయన రచనలలో ఆవేశ ప్రేరణ హెచ్చు; గనుక పాఠకులకు క్షమాగుణముకు బదులు హింసా ప్రేరణ సూచితమగును.

ఇక్‌బలు ఉర్దూవలె ఫారసీభాషలోను 'పయామేమష్రిక్' మున్నగు ఘనకావ్యములను తత్వగర్భితమగువానిని రచించి, ఫారసీ ప్రపంచంలోను పేరు ప్రతిష్ఠలు గాంచెను.

దేశీయులలో చాలమంది స్థితివంతులు పాశ్చాత్యానుకారులు భోగలాలసులు నగుటను చూచి, అట్టి ప్రవృత్తిని ఇక్బలు తన రచనల లో తీవ్రముగ ఖండించెను ; దళితులగు నిమ్నజాతీయులను వెనుకబడిన వర్గములను ఉద్ధరించుటకు వారిలో చైతన్యమును శక్తిని పెంపొందించు టకును తన లేఖిని నుపయోగించెను ; అప్పటికి ప్రజలలో వ్యాపించి యుండిన మాంద్యమును అలసతను పోగొట్టి కర్తవ్యపరులుగ జేయుట కును ఉత్తేజకమగు గీతముల నెన్నిటినో వ్రాసెను ; నిరంతరమగు కార్య శీలతను ప్రబోధించెను. కాని తామస తత్త్వమును నిరసించుటలో గాలిబు హాలీ ఇత్యాదులతో నేకీభవించినను, వారివలె సాత్వికతత్వము

* హైవహీ తేరే జమానే కా ఇమామే బర్‌హక్, జో తుఝే హాజిరో-మౌ జూద్ సే బేజార్ కరే, మౌత్ కే ఆఇనేమేఁ తుఝ్‌కో దిఖాకర్ రుఖే-దోస్త్ జిందగీ ఔర్ భీ తేరే ఏ దుశ్వార్ కరే, దేకే ఎహసాసే-జియాఁ తేరాలహూ గర్‌మాదే, ఫఖ్ కీశాన్ చఢాకర్ తుఝే తలవో కరే॥ (బాలే-జిబ్రీల్)

† హై శబాబ్ అపనే లహూ కీ ఆగ్‌మేఁ జలనే కా నామ్ సఖ్త్ కోశిస్ హై తయఖే-జిందగానీ అంగమీ।
జో కబూతర్ పర్ ఝపటనే మేం మజా హై అయ్ పిసర్,
వహ్ మజా, శాయద్, కబూతర్ కే లహూ మేం భీ నహీ॥ (బాలే-జిబ్రీల్)

నాగ్గడించుటకు బదులు, ఇక్బలు రాజసతత్త్వమునే ఆదర్శముగ శ్లాఘించెను; ఇది అరవిందుడు రవీంద్రుడు అవలంబించిన మార్గమునకు భిన్నము; అహింసాప్రవృత్తియగు గాంధీతత్త్వము కిది వ్యతిరిక్తమని వేరుగ చెప్పనక్కరలేదు. ఇక్బలు తుది దశలోని రచనల ఆశయములు రాజకీయంగా భారతీయైక్యమునకు భిన్నమార్గమును బట్టినవి. ఇదిగాక, ఇక్బలు శైలిలోను క్రమంగా దేశీయతకు సులభతకు బదులు కఠినమగు అరబ్బీ పారసీపదముల భారము పెరిగి ఇచటి సామాన్యజనుల కట్టి శైలి దుర్బోధమయినది. ఈ యన్ని కారణములవల్లను మహాకవి ఇక్బలు రచనలకు గాలీబు, హాలీ, అక్బరు ఇత్యాదులకు గల్గిన ప్రజాదరణ దేశంలో లభించలేదు. అయినను ఆయన విద్వత్కవిత్వము ఘనమయినదే.

# నన్నెచోడుని కుమారసంభవము

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

క్రీ. శ. 1909 వ సం॥లో నన్నెచోడుని కుమారసంభవమును శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రచురించినది మొదలుకొని యాంధ్రదేశమున నది గొప్ప యలజడి గల్గించుటచే పండితు లందఱు నాతని కాలనిర్ణయమునకై శాసనములను పరిశోధించి చారిత్రక విమర్శనమును సాగించిరి. కొన్నికారణములచే నాతని కాలనిర్ణయము శాసనములనుబట్టి సంతృప్తికరముగ నిర్ణయింపబడమిచే మఱికొందఱు పండితు లాకావ్యమందలి భాషావిశేషములనుబట్టి నన్నెచోడుని కాలనిర్ణయమును జేయఁబూనుకొని యాతని కుమారసంభవమందలి భాషను గూర్చిన పరిశీలనమొనర్చిరి. ఇందుచే చోడుని కుమారసంభవమును గూర్చి వ్రాసిన వ్యాసములు, గ్రంథము లన్నియు నాతని కాలమును గాని, యందలి భాషనుగూర్చి గాని తెలుపునవియే కాని, యాతని కవితాశిల్పమునుగూర్చి విచారించినవారు సామాన్యముగ లేరనియే చెప్పవచ్చును. ఎందుకన వారికాలము, శక్తిగూడ పైవిషయములను పరిశోధించుటయందే సరిపోయినది. అయితే చోడునికవిత్వ మంత సూక్ష్మపరిశీలన కర్హమైనది కాదేమో యందురా ? అతని కవిత సర్వసామాన్యమైనదే యగుచో, నాతని కాలమునుగూర్చి గాని, భాషను గూర్చి కాని పండితు లంత తాపత్రయముపడకయే యుండెడివారు. కాని యతని యసాధారణకవితాశిల్పవైచిత్రిని గూర్చి విచారించుట కంటె, నాతని కాలనిర్ణయవిచార మెందులకు ముఖ్యమైనదనఁగా, శ్రీ రామకృష్ణకవిగారు నన్నెచోడ కుమారసంభవప్రకాశపీఠికలో చోడకవి క్రీ. శ. 940 ప్రాంతమువాడని వ్రాసి ప్రకటించుటయు, రెండవ కారణము చోడకవియే తనగ్రంథావతరణికయందు దానొరయూరు ముఖ్యపట్టణముగా నేలిన చోడరాజవంశీయుఁడనని తెల్పుకొనుటయే.

ప్రథమాంధ్రకావ్యకర్త నన్నయభట్టని నాఁటివఱ కందఱు నేకగ్రీవముగా నంగీకరించియుండఁగా నాతనికంటె సుమారు నూఱుసంవత్సరములకుఁ బూర్వమే యాంధ్రమున నొక రసవంతమైన కావ్య మొకతమిళకవిచే నాదిరసవత్కావ్యముగా రచింపఁబడిన దనుటయు నది యంతవఱకు నాంధ్రలోకమున కశ్రుతపూర్వ మగుటయు నాంధ్రపండితమండలిలో నొక నూత్నచైతన్యము గల్గించి సత్యాన్వేషణమునకుఁ బురికొల్పినది. తత్ఫలితముగా కొంతకాలమునకు కొంతసత్యము తేలి, కవి కాలసమస్య కొంతవఱకు సంతృప్తికరముగనే పరిష్కారమైనది. దేవదానవులు పాల్కడలిని మథించినట్లు విమర్శకులు మథింపగ సత్య మెంతకాలము దాగియుండఁగలదు ? చోడుని కాలసమస్య పరిష్కారము కాఁగనే యాతని కవితాశిల్పవిశేషములనుగూర్చి స్థూలపరిశీలనము చేసినవా రేయొకరిద్దఱో తప్ప, సూక్ష్మవిచారణ చేసినవా రెవరును లేరైరి. ఆంధ్ర భారత భాగవత రామాయణాది పురాణములను గూర్చి, శృంగార నైషధ, మనువసుచరిత్రాముక్తమాల్యదాది మహాకావ్యములను గూర్చి కవితాశిల్పదృష్టితో బహువిశేషముగా విమర్శనములు, చర్చలు జరిగినవి. కాని చోడుని కుమారసంభవమునుగూర్చిన కవితా శిల్పవిమర్శనలు మాత్రము జరుగలేదు. చోడకవి మహాకవి యని గ్రహించి తర్వాతికవు లాతని పద్యపాదములనుబట్టుకొనిరే. కాని, యాతని పూర్వకవిస్తుతులలో మాత్రము చేర్పనట్లే, యాతని కవితా శిల్పము శ్రేష్ఠమైనదే యని యొక యుపచారవాక్యమును మాత్రము 'చంద్రుని కొకనూలుపో' గన్నట్లు చెప్పి విమర్శకులు దాఁటిపోవు చున్నారే కాని యాతని కావ్యమునుగూర్చి లోఁతుగ విచారించినవా రెవరు నింతవఱకు లేరైరి. రావలసినంతకీర్తి తన కావ్యమున కీలోక మున రాకపోవుటచే చోడకవియే దురదృష్టవంతుఁడో; లేక యాతని కావ్యామృతాస్వాదనానందమునఁ దేలి తగినంతగా మెచ్చుకొనలేక

పోవుటకు మనమే దురదృష్టవంతులమో తెలియదు. ఆతని కావ్యవిశే షముల ననుకరించిన యితరాంధ్రకవులకు వచ్చినంత కీర్తి గూడ నతనికిఁ దక్కలేదు. ఈతని కావ్యమందలి పద్యముల ననేకు లనుకరించిరని శ్రీ మానపల్లి రామకృష్ణకవిగారు కుమారసంభవ ద్వితీయభాగమునను, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు కుమారసంభవవిమర్శయందును స్పష్ట ముగ వివరించిరి. చోడకవి ననుకరించి యతని పదములనే పట్టుకొనుట యితరులకంటె తిక్కనయే యత్యధికముగాఁ జేసెనని యాగ్రంథము లను పరిశీలించినవారికి స్పష్టమగును. తిక్కన కవిత యాంధ్రమునఁ బరమోత్కృష్టమైనదిగ పరిగణింపఁబడినపుడు దానికి మేలుబంతియైన దెట్లుండఁ దగునో చెప్పనలయునా? కాని దానికి తగినప్రచారము లేకపోవుటచే "ముందువచ్చిన చెవులకంటె తర్వాతవచ్చిన కొమ్ములు వాడి" యన్న ట్లైనది. ఈకాలమున వస్తుగౌరవముకంటె ప్రచార గౌరవవిశేషమునుబట్టి వస్తువునకు ఘనత పెరుగుచున్నదికదా. కాన చోడకవికావ్యమున కాప్రచారగౌరవవిశేషము దక్కలేదు.

చోడకవి భాషావిశేషములు లాక్షణికులకు ప్రామాణికములు గాకపోవుటచేతనైననేమి, యతఁడు శైవకవి యగుటవలననేమి, మఱి యేయితరకారణములచేతనేమి, యతని కావ్యమున కనేకులు ప్రతులు వ్రాసికొని, పఠించి భారతాది కావ్యములకువలె విశేషప్రచారమొసగి నట్లు ప్రాచీనులలోఁ గానరాదు. అందుచేతనే యీతనికావ్యమునకు భారతాదికావ్యములకువలె నాంధ్రదేశమున ననేకప్రతులు దొరకక పోవుట. అటు తర్వాత 1909 సం॥ నుండి ముద్రణమొందినను గూడ దానికి విశేషప్రచారము లేకపోయినది. శ్రీ కవిగారు దానిని రెండు భాగములుగ చిన్నయచ్చులో బహుస్వల్పప్రతులను, సుమారు 300 మాత్రము ముద్రించిరి. కాని యన్నిగ్రంథములవలె 1000 ప్రతులు గూడ ముద్రింపరైరి. 1914 సం॥ లో ద్వితీయభాగము వచ్చుసరికే

ప్రథమభాగపు కొలదిప్రతు లన్నియు వ్యయమైపోయినవి. ద్వితీయ భాగము కొనువారికి ప్రథమభాగము దొరకలేదు. రెండుభాగములను సంపాదింపఁగల్గినవారు బహుస్వల్పసంఖ్యాకులుమాత్రమే. ఆ ప్రబంధ మును సంపూర్ణముగను, ధారాళముగ నితరకావ్యములకువలె విక్రయ మునకుగాని, పఠనమునకుగాని పొందగల్గుట కవకాశములు లోకము నకు లేకపోయినవి. యథార్థమున కది మనువసుచరిత్రములు, శృంగార నైషధాముక్తమాల్యదలవలె ప్రతిపదార్థతాత్పర్యసహిత సంపూర్ణ వ్యాఖ్యతో చదువఁదగినది. కాన నట్లు ముద్రింపఁదగినది. దాని కా భాగ్య మబ్బమిచే నది కొందఱకుమాత్రమే గమ్యమైనది. మఱియు నది చిన్నయచ్చులో ముద్రింపఁబడుటచే సామాన్యపాఠకు లోపిక తోను నుత్సాహముగ చదువుటకుఁగూడ నవకాశము లేకపోయినది. 1948 సం॥న మద్రాసు విశ్వకళాపరిషత్తువారు దీనిని శుద్ధపఱచి యాక ర్షణీయముగ ముద్రించువఱకు నీగ్రంథము పాఠకలోకమునకు దుర్లభ మైనదనిన నతిశయోక్తి కాదు. అచ్చైన రెండు మూడు సంవత్సరము లకే యీప్రతులుగూడ వ్యయమైపోయినవి. ప్రస్తుత మవి లభ్యము గావు. ఎందుకన నా విశ్వకళాపరిషత్తువారు 200 ప్రతులకంటె నధికము ముద్రింపరు. కాగా మద్రాసు విశ్వకళాపరిషత్తువారి గ్రంథము వెలువడు సమయముననే వావిళ్లవారు చిన్నక్రౌనుసైజులో దానిని ముద్రించి ప్రచురించిరి. దీనిప్రతులు దొరకవచ్చును. ఇది కేవలము వ్యాపార ప్రతి. వారి యితరప్రచురణలవలె నిది ముద్రణదోషములతో నిండి చదువుట కాకర్షణీయముగా లేదు. ఇంతవఱకు కుమారసంభవమునకు వ్రాతప్రతి యొక్కటిమాత్రమే తంజావూరి సరస్వతీమహాలు భాండా రమున దొరకినది. అది పరమచ్ఛిద్రావస్థలో నున్నది. దానిలో ననేక లేఖకస్ఖాలిత్యములు, లుప్తభాగములు, కీటకభక్షితస్థలములు మొదలైనవి విశేషముగా నున్నవి. ప్రతులు వ్రాసికొనువారు గాని,

ముద్రించువారుగాని వీనినన్నింటిని జక్కఁగఁ బరిశీలించి, సంస్కరించి శుద్ధపఱచినఁగాని సామాన్యపాఠకలోకము దాని కవితామహత్త్వమును బూర్తిగ గ్రహింపఁజాలరు. దీనికిఁదోఁడు దానిలోఁ గొన్ని తమిళకన్నడపదములు నాకాలపు ప్రాచీనభాషాప్రయోగములు నుండుటచే, తమిళకన్నడాదియన్యభాషాజ్ఞానమును, నాంధ్రభాషాసంప్రదాయతత్త్వమును, సంస్కృతభాషాపాండిత్యము, నలంకారఛందశ్శాస్త్రవైదుష్యమును బూర్తిగాఁగలిగిన పండితునకుఁగాని దీనిని సంస్కరించి శుద్ధపఱచుటకు సాధ్యము గాదు. ఈ విశేషలక్షణము లన్నియు నొక్కవ్యక్తియం దుండుట కష్టము. అనేకపండితులను పోషించి యొక్కగ్రంథమును సంస్కరింపించుటవలనఁ బ్రచురణకర్తలకు విశేషలాభము నుండదు. సారస్వతసేవ యొక్కటితప్ప యార్థికముగఁ గాని, పారమార్థికముగ గాని, రాజకీయముగఁ గాని దీనివలనఁ బ్రయోజనము లేదు. లాభ మున్నగద కష్టమునకు సహింతురు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు గొప్ప పండితులు సమర్థులు. వారిమతమున కనుగుణముగా దానిని మొట్టమొదట సంస్కరించి ప్రచురించిరి. మద్రాసుయూనివర్సిటీవారి యాజమాన్యమున శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు వారికిఁ దోఁచినట్లుగా నేడాశ్వాసములను సంస్కరించి ముద్రించినతోడనే వారు దివంగతులౌటచే దానిని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వారిమతానుగుణముగ శక్తిలోపము లేకుండ మిగిలినభాగమును సంస్కరించి పూరించవలసినపరిస్థితి యేర్పడినది. ఈ ప్రతినిగూర్చికూడఁ గొందఱుపండితులు దమయసంతృప్తిని సూచింపకపోలేదు. పిమ్మట దీనిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంస్కరింపఁజేసి, ప్రచురింపఁజేయుటకు శ్రీ పిఠాపురము రాజావారు గొంతప్రయత్నము చేసిరనియు, దాని కేవో విఘ్నములు వాటిల్లిన వనియుఁగూడఁ దెలియుచున్నది. చోడుని కుమారసంభవమును పరిశోధించిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారుకూడ కీర్తిశేషు

లైరి ; కాన దానిపాఠాంతరముల నిర్ణయించి సంస్కరింపఁదగినవారు ప్రస్తుతము గనఁబడరు. ఇటీవలనే శ్రీ ప్రభాకరశాస్త్రిగారు సంపాదించిన పాఠములుగాఁబోలు వారి ప్రియశిష్యుఁడగు చిరంజీవి తిమ్మావఝుల కోదండరామయ్య భారతిలో చోడునికుమారసంభవముద్రణ మనుశీర్షికతో నొకటిరెండువ్యాసములను ప్రచురించెను. మఱియు డా॥ నేలటూరి వెంకటరమణయ్యగారుగూడ నట్టువంటివే మఱియొకటి, రెండువ్యాసములను భారతిలోనే వ్రాసిరి. విచిత్ర మేమనఁగా పైనపేర్కొనిన నాలుగైదుగురుపరిష్కర్తలలో నొకరిపాఠ మింకొకరి కర్థమున నన్వయమున నచ్చకపోవుటచే నీగ్రంథమును చోడకవి యొక్కఁడే రచించినను దీనికి పలురూపము లేర్పడి, నన్నెచోడకవియే యిప్పుడు తిరిగి బ్రతికివచ్చినను వీనిలో నొక్కదానినిగూడ తనదే యని యంగీకరింపలేనంతగా నది మాఱిపోయినది. ఇట్టిస్థితిలో దానికి మూలపాఠమును గుర్తించుటకాని, లేక చోడకవియభిప్రాయమున కనుగుణమైన పాఠమును సంతృప్తికరముగా నిర్ణయింపఁగల్గుటకాని యసాధ్యమనిపించును.

ఇఁక నీప్రబంధభాగములు కొన్ని యూనివర్సిటీపరీక్షలకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపఁబడుటచే విద్యార్థులు నుపాధ్యాయులుగూడ దానిని జదువవలసిన యవసరము పట్టినది. కాని వా రాయూనిర్ణీతభాగములనుమాత్రమే యెట్లో కష్టసాధ్యముగఁ జదివెడువారు. సంపూర్ణముగ నాకావ్యమును జదువ నవకాశముగూడఁ గల్గెడిదికాదు. దీనికి ముఖ్యకారణ మాగ్రంథము సులభముగా లభ్యము కాకపోవుటయే. అందుచే సామాన్యముగఁ గళాశాలోపాధ్యాయులకుఁగూడ నీకావ్యమందుబాటులో లేకపోవుటచే దానిలోని కవితాశిల్పవిశేషములను జదివి యానందించి, విమర్శించి ప్రచురించుటకుఁగూడ నవకాశము లేకపోవుచున్నది. కాన బహుసంఖ్యజనముమాత్రము దీని నామమాత్ర

ముఁగ తీఱకగ, సహనముతోఁ జదివి యందలి కవితావిశేషములను గుర్తింపఁగలుగుచున్నారు. అటువంటివారైన నింతవఱకు భారత భాగవత రామాయణాదిపురాణములమీఁద వ్రాసినట్లుగాని, మను వసుచరిత్రాముక్తమాల్యాదాదిప్రబంధములమీఁద రచించినట్లుగాని సంపూర్ణవిమర్శను జేయలేదు. ఏదైన కావ్యమునుగూర్చి సంపూర్ణ విమర్శను నిష్పాక్షికముగాఁ జేసిననాఁడుగాని దాని గుణాగుణములు తేలవు. అభిప్రాయభేదవ్యక్తీకరణముతో పండితులు వివిధవిషయము లను చర్చించినఁగాని దానితత్త్వము బయలుపడదు. ప్రథమాంధ్ర ప్రబంధమగు నన్నెచోడుని కుమారసంభవమునుగూర్చి కవితాశిల్ప దృష్టితో నట్టివిమర్శనలు వెలువడకుండుట కడు విచిత్రముగా నున్నది. కుమారసంభవమును కూలంకషముగాఁ జదివిన నడకుదిటి వీరరాజు, వేటూరి ప్రభాకరశాస్త్రి మొదలైన ప్రాచీనపండితులు దివంగతులైరి. కొందఱు పరమార్థకదశలో నుండి లౌకికసారస్వతవిషయములను సన్యసించిరి. ఇఁక నవీనయువకులు నేఁటికాలపు ప్రజాప్రభుత్వకాలము లోనివారు గాన, శీఘ్రయశస్కాములై ప్రజావాఙ్మయమగు కథలు, నాటికలు, గేయములు మొదలైనవి వ్రాయుట, వానిని విమర్శించుట యందు వారికాలమును వినియోగపఱచుచున్నారు. యూనివర్సిటీల పరిశోధనపట్టములకు ప్రయత్నించువారుగూడ ప్రస్తుతము ప్రాచీనవిష యములపై మనసు నిలుపక, నపాయములేనియుపాయముతో లఘు విషయములఁగూర్చియే పాటుపడుచున్నారు. ఏకారణముచేతనైన నేమి యీవిధముగా నన్నెచోడుఁ డెవ్వరిదృష్టులలోను బడక తప్పి పోవుచున్నాఁడు. అందుచే నతని కవితాప్రతిభావిశేషములు మరుగు పడియేపోయినవి. కొందఱి తెలుఁగువారిదృష్టిలో కుమారసంభవ మును జదువఁదలఁచిన కవికులగురువగు కాళిదాసుకుమారసంభవమునే చదువవలయును గాని, “కాళిదాసు చేపట్టినవస్తువు నింకొకకవి చేపట్టి

యున్నచో, కాళిదాసుతో నతనికి పోలిక యేమి" టని యతని గ్రంథ మును విప్పిచూడకయే త్రోసిపుచ్చవచ్చును.

యథార్థమునకుఁ గాళిదాసనన్నెచోడుల కవితాతారతమ్య మును విచారింపఁదలచినవారు, వారి సంస్కృతాంధ్రకుమారసంభవము లను పరస్పరము పోల్చి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు విరాట పర్వవిమర్శనమున వ్యాసతిక్కనల రచనలఁ బరస్పరము పోల్చి చూచిన ట్లాయావిశేషములను విపులముగను, విశదముగను ప్రదర్శింప వలెను. కాని యట్టి కృషి యింతవఱ కెవ్వరును జేయలేదు. ఆరీతిగ చేయక, 'కవికులగురువైన కాళిదాసుతో నతనికిఁ బోలిక యేమి' టని కాని, 'ఎఱ్ఱనసోమనల హరివంశములవలె నీరెండూ తెలుఁగు గ్రంథాలే అయియుంటే, అట్లా పోల్చిచూడటం గొంత సుకరమే. కాని యొకటి సంస్కృతమునను మఱియొకటి తెలుఁగునను స్వతంత్ర ముగా సాగించిన రచన గలదనుటచే నీరెంటిని పోల్చిచూచుట దుర్ఘట మైనపనియే' యని యుపేక్షించి, స్థాలీపులాకన్యాయముగ రెండుకావ్య ములను పోల్చిచూచి, యేవో కొన్నివిమర్శనవాక్యములను తోఁచి నట్లు చెప్పినచో 'నా రెండుగ్రంథాలలోనికథను, నాకవు లాకథను చెప్పినపద్ధతిని, కవితాశక్తిలో, చిత్తసంస్కారములో నిరువురకున్న తారతమ్యమును గొంతవఱకైనను' సంతృప్తికరముగా నిర్ణయింపఁ బడకపోవును.

"కుమారసంభవము : కాళిదాసనన్నెచోడుల కవితాసాదృశ్య" మను శీర్షికతో శ్రీ పింగళి లక్ష్మీకాంతముగా రొకరేడియోప్రసంగ మును జేయఁగ నది రేడియోవారి 'వాణి' లోను, 'సంస్కృతి' (1954, ఏప్రిల్ సంచిక) లోను ప్రచురింపఁబడినది. అంతకుఁ బూర్వము మాగంటి బాపినీడుగారి సంపాదకత్వమున వెలసిన ఆంధ్రసర్వస్వమున నాంధ్రభాషావాఙ్మయ మనువ్యాసమున నన్నెచోడునిఁగూర్చి వ్రాయుచు

నతని కుమారసంభవమునుగూర్చి శ్రీ లక్ష్మీకాంతముగారు బహుళ్లుప్తముగాఁ గొంత విమర్శ చేసిరి. ఈ రెండువ్యాసములందలివిషయములను బురస్కరించుకొని నన్నెచోడుని కుమారసంభవవిమర్శనము పాఠకులకు సహాయకారి యయ్యెనో లేదో పరిశీలింపఁబడును. వారు మొదట నాంధ్రసర్వస్వమున నన్నెచోడునిఁగూర్చి యిట్లు వ్రాసిరి. "ఈ కవికి కవిరాజశిఖామణి యను బిరుదు గలదు. ఈ బిరుదులో ఈయన రాజభావము కొంతస్ఫురించుచున్నను, కవితాగుణమును బట్టి కూడ దానికిఁ గొంతి సార్థకతయే యున్నది. ఈ రాజకవి ఆంధ్రకవులందుత్తములలో లెక్కింపఁదగినవాఁడే కాని సామాన్యుఁడు గాఁడు. కుమారసంభవమున నేపథ్యము చూచినను మిక్కిలి స్వతంత్రమును, రమణీయమును నైనభావముండుట, ఆభావము అపేలవమును, మధురము నైనపదములలో వ్యక్తమగుట, ఆపదములలో నెక్కువపాలు జానుతెనుఁ గనిపించుకొను దేశ్యపదజాలమే యగుట స్పష్టమగుచుండును. కొన్నిచోట్ల పూర్వకవుల భావములు, తచ్ఛాయలు ననుకరించినను వానిని తనసొమ్ముగాఁ జేసికొని ప్రపంచించుకొనునేర్పు ఈకవికి చాల గలదు. నన్నెచోడుని గొంతలోపమున్నను, ఈ కుమారసంభవమే యన్వర్థముగా మన ప్రథమప్రబంధము. ఈకవికి వర్ణనాభిలాష చాల యెక్కువ. కొన్నివర్ణనలు మితిమీఱి విసువు గొల్పునవిగా నుండును. మఱికొన్ని సందర్భోచితిఁ గోలుపోయి, విరసములై పసు గొల్పును మొత్తముమీఁదఁ జూచినచో ఈ కావ్యము రెండు విరుద్ధాంశములకు సంగమస్థానమేమో అనిపించును. ఒకవంక కాళిదాసు, తిక్కన మొదలగు ఉత్తమసంస్కృతాంధ్రకవుల శిల్పలక్షణములును, ఇంకొకవంక క్షీణయుగములోని క్షుద్రప్రబంధముల లక్షణములును ఈకావ్యములో రాశీభూతమై యున్నవి." ఇఁక శ్రీ లక్ష్మీకాంతముగారి రేడియోప్రసంగము వంతయు నుదాహరించుట

యనవసరము కాన విమర్శనీయవిషయములనుమాత్ర ముదాహరించి వానియౌచిత్యమును పరామర్శింపఁబడును.

(1) "నిజానికి తెలుగుమాట అట్లా వుంచి సంస్కృతంలోనైనా కాళిదాసు చేపట్టిన వస్తువును యింకొకకవి చేపట్టివుంటే-అట్టిసాహసుకు లేడనుకోండి-కాళిదాసుతో అతనికి పోలిక యేమిటని, అతని గ్రంథాన్ని విప్పిచూడకుండానే త్రోసిపుచ్చవచ్చు-యేమంటే-కవి కులంలో కాళిదాసునిపేరు చెప్పినతరువాత ద్వితీయుడుగానైనా చెప్పటానికి వెంటనే రెండవపేరు స్ఫురింపదు. 'అనామికా సార్థవతీ బభూవ' అన్న యభియుక్తోక్తి యిందువల్లనే పుట్టింది. అట్టి కాళిదాసుతో యీ తెలుగుకవిని పోల్చిచూస్తే, పాపం యీతనికి యేమి న్యూనత కల్గుతుందో అనే సంకోచం ఉండటం సహజమే కాని, బరిమీద వదిలి పెడితే, ఇతడు గెల్వలేకపోయినా కాళిదాసుతో పెనగగలవాడే కాని, మల్లచరుపు విన్నంతనే భయపడి పారిపోడనే మాటమాత్రం నిజం." అని యెత్తుకున్నారు లక్ష్మీకాంతముగారు. కాళిదాసునిపై వీరికిఁగల భక్తిగౌరవములు మెచ్చుకోఁదగినవే. కాని ఒకకవి రచించిన కావ్యమును విమర్శింపఁబూనుకొనుటకు ముందుగానే యాకవినిగూర్చిన యొకయభిప్రాయమును మనస్సులోఁ బెట్టుకొని యాతని కావ్యవిమర్శను సాగించినచో నీవిమర్శనమంతయు నాపూర్వాభిప్రాయానుగుణముగనే యుండును గాని, నిష్పాక్షికముగ నుండఁజాలదు. అందుచేతనే విమర్శకుల మనస్సులు పూర్వాభిప్రాయముద్రితములు (pre possessed mind) గా నుండరాగనియు, రాగరహితముగ (disinterestedness) నుండవలెననియు, కవితో సహృదయత్వము (sympathitic attitude) నెఱపవలయుననియు ముందుగా విమర్శకులకు హెచ్చరిక నిచ్చుట ముఖ్యమైనది. కావ్యమందలి విశిష్టగుణములను జూపి, తర్వాత వాని యోగ్యతను తారతమ్యదృష్టితో నిర్ణయించినచోఁ గవికి నాతనికావ్యమునకు

న్యాయము జరుగునుగాని, కాళిదాసునకు నన్నెచోడునకుఁ బోలిక యేమి ? యను పూర్వాభిప్రాయకళంకితమనస్సుతో వారు కుమార సంభవములను విమర్శింపఁమూనుకొనినచో నావిమర్శ పక్షపాతకళం కితము కాకతప్పదు. ప్రాచీనవిమర్శధోరణి యెట్లున్నను నవీనవిమర్శ పద్ధతి ననుమేయ (inductive) మార్గమునఁ గావ్యగుణములను వెలువ రింపకుండ నిట్లు విమర్శింపఁబూనుట యెంతమాత్రమును సమంజసము కాదు. కాళిదా సెంతప్రసిద్ధుఁడైనకవికులగురువైనను నతని నింకెవ్వరు ప్రపంచమున మించరాదని తలంచుట సంకుచితదృష్టియే కాని విశాల దృష్టి కాదు. ఆంగ్లభాషాకవిశేఖరుఁడైన షేక్స్పియరుకవి సంస్కృత కవికులగురువైన కాళిదాసునిగూడ ననేకవిధముల మించునని యనేక భారతీయవిమర్శకులే యంగీకరించిరి. ఇఁక విదేశీయులమాట చెప్ప నక్కఱయే లేదు. కాళిదాసుగూడ వాల్మీకి, భాస సౌమిల్లికాదిపూర్వ కవులనుండి నేర్చుకొనఁదగినది నేర్చుకొని వారిరచనలకు మెఱుఁగు పెట్టినాఁడు గదా. "అథవా కృతవాగ్ద్వారే వంశేస్మిన్ పూర్వ సూరిభిః"..............అని కాళిదాసే చెప్పుకొనినాఁడు. కాన లతని మించరాదనిగాని, యతనికి మెఱుఁగు పెట్టలేరనిగాని భావించుట సమంజసము కాదు. ప్రతిభ యనేక విధములు గలది. ఒకేయితివృత్తమును గ్రహించి రచించిన మహా కవులలోఁగూడ నొకరిలో నొకవిశిష్టగుణము భాసించును. మఱియొక రిలో నింకొకటి ప్రకాశించును. విమర్శకుఁ డాలక్షణములను వివరించి చూపును. ఈప్రసంగములోనే మఱియొకచో శ్రీ లక్ష్మీకాంతముగా రిట్లు తెలిపినారు. "నిజంగా ఈ పద్యం కాళిదాసే చూచివుంటే సంస్కృ తంలోకి అనువదించేవాడేమో ననిపిస్తుంది. కాళిదాసునే మురిపించే పద్యాలు యిట్టివి యీగ్రంథంలో అక్కడక్కడ చాలా ఉన్నాయి." అను వారివాక్యములనుబట్టియే నన్నెచోడ [illegible]

నైనా కాళిదాసునిరచనలను మించునట్టివి గలవని యంగీకరించినట్లే కదా. అట్టిస్థితిలో "అతడు (నన్నెచోడుడు) గెల్వలేకపోయినా కాళిదాసుతో పెనగగలవాడేగాని" యని చెప్పుటలో నర్థ మేమి? అధమపక్ష మతనితో సమానుఁడనియైనఁ జెప్పిన దోషము లేదుగద. అట్లంగీకరించినచోఁ గాళిదాసునకు న్యూనత వాటిల్లునా యేమి? "రెండు గ్రంథాలలోని కథను, ఆకవులు ఆకథను చెప్పినపద్ధతిని, కవితాశక్తిలో, చిత్తసంస్కారములో నిరువురకు నున్న తారతమ్యమును గొంతవఱకు పోల్చిచూడకుండ, పూర్వాభిప్రాయముద్రితమనస్సుతో విమర్శను ప్రారంభించుట యుచితజ్ఞులైన రసజ్ఞు లంగీకరింపరేమో? వ్యాసుని భారతరచనమునకు మెఱుఁగుపెట్టి తిక్కనార్యుఁ డాంధ్రభారతమును రచించినాఁడని మనము విశ్వసించుచున్నాము కదా. అట్లే కాళిదాసుని కుమారసంభవమునకు నన్నెచోడుఁడు మెఱుఁగుపెట్టె నని మన మేల భావింపరాదు. కవిబ్రహ్మ యనఁబడిన తిక్కనయే భారత నిర్వచనోత్తరరామాయణములలో నన్నెచోడునిరచనల ననుకరింపవలసినవాఁడయ్యెనే; అట్టినన్నెచోడుఁడు, కాళిదాసుని రచనకు మెఱుఁగు పెట్టఁగల శక్తిలేనివాఁడని భావింపఁగలమా? లేక యట్లంగీకరించుట కాళిదాసునికీర్తిని కొంచెపఱచినట్లగునా? లేక నన్నెచోడుని శక్తి నధికపఱచినట్లగునా? ఉన్నదున్నట్లు తారతమ్యవిచారము చేసి చెప్పుట దోషము కాదుకదా. తిక్కన భారతరచన వ్యాసుని భారతరచనకు మెఱుఁగుపెట్టిన ట్లున్నదనినప్పుడు, వ్యాసునికీర్తిని గొంచెపఱచినవార మగుదుమా? అది యథార్థ మగుచో దోషమే లేదుకదా? యథార్థము కానిచో లోకము విశ్వసింపదు. పూర్వకవుల నుత్తరకవులు మించుటలో విచిత్ర మేమియును నుండదు. ఈ పరిణామము సక్రమమే. పూర్వకవులపోకడలఁ జూచియు నుత్తరకవులు వారి ననుస[illegible] లజ్జాకరము. ఉత్తరకవులు పూర్వకవుల

ననుసరించి వారికి కృతకృత్యతఁ దెలుపుచు వారినిగూడ మించుట ప్రశంసనీయము, సక్రమము, సమంజసముఁ గూడ. స్థిరప్రతిష్ఠుఁడైన కవిని పొగడుట సర్వజనాంగీకారమే, కాని యుత్తరకవు లాతనితోఁ బోల్పనైనఁ దగ రనుభావముతో విమర్శను సాగించుటమాత్రము సరసము కాదు.

(2) "ఈకవికి వర్ణనాభిలాష చాల యెక్కువ. కొన్ని వర్ణనలు మితిమీఱి విసువుగొల్పునవిగా నుండును. మఱికొన్ని సందర్భోచితి గోలుపోయి విరసములై ఏవముగొల్పును." శ్రీ లక్ష్మీకాంతముగారి యీయభిప్రాయ మెంతవఱకు సమంజసముగా నున్నదో విచారింతము. తన కుమారసంభవకావ్యము ప్రబంధ మని నన్నెచోడుఁడు చెప్పికొను టయేకాక, వీరుగూడ నంగీకరించినారు గాన, దీనిని ప్రబంధలక్షణ దృష్టితో విమర్శించుట సరసముగా నుండును కాని, వేఱువిధముగా నేపురాణదృష్టితోడనో చూచినచోఁ గవికిని, కావ్యమునకుఁగూడ గొప్పయపచారము చేసిన ట్లగును. మొట్టమొదట ప్రబంధ మనఁగా నెట్టిదో గుర్తించినఁగాని సద్విమర్శ సాగదు. పురాణాంతర్భాగకథను ప్రపంచించి, 'యష్టాదశవర్ణనలతోఁ బరిపూర్ణంబై, దశప్రాణంబుల సప్రాణంబై, నవరసభావభరితమై, షట్త్రింశదలంకారాలంకృతంబై' శృంగారరసప్రధానమై యుండునది ప్రబంధ మని గ్రహింపఁబడు చున్నది. ఇందలివర్ణనలు సామాన్యముగాఁ గృత్రిమములై కవికల్పనా శక్తిని ప్రకటించును. ఈకల్పనల వివిధాలంకారములతో వ్యక్తీక రించుట ప్రబంధసంప్రదాయము. ఇందుచే ప్రబంధములందు ముఖ్య ముగా కవికల్పనాశక్తిని పరీక్షించి, యందలి ప్రాశస్త్యమునుబట్టి కావ్య గౌరవమును నిర్ణయింపనగును. కాన వర్ణన లత్యధికముగా నుండి కథాగమనము నడ్డగించుట ప్రతిప్రశస్తప్రబంధమునందు సామాన్య ముగా నుండునదే. ఉదా:— ఆముక్తమాల్యద, వసు మనుచరిత్ర

ములు మొదలైనవానియందుఁగూడ నిది యనివార్యమైనది. కావున దాని నొకదోషముగా ప్రబంధమునఁ బరిగణించుట సమంజసము కాదు. ఈదృష్టితోఁ జూచినచో నన్నెచోడుని కుమారసంభవ మత్యుత్తమ శ్రేణికిఁ జెందిన యాంధ్రప్రబంధముగఁ బరిగణింపఁదగినది. ఇందు పలు విధములైన రచనలతోఁగూడిన సత్కవితాగుణములు కలవు. ఈతని వర్ణనలు వినువుగొల్పుననుట ప్రౌఢకల్పనలు గిట్టని యలసులకు మాత్రమే. ఈ సందర్భమున శ్రీహర్షునిభావమును గమనింపఁదగినది.

చ. పనివడి నారికేళఫలపాకమునం జవిమైన భట్టహ
 ర్షునికవితానుగుంభము పసోమరిపోతులు గొంద అయ్యొ లొ
 నని కొనియాడ నేర రది యట్టిద, లేజనరాలు చెక్కగీ
 టిన వస వల్చు బాలుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే.

ఇఁక నీతనివర్ణనలు సందర్భోచితి లేవనుట, కాళిదాసాదిమహాకవు లందుఁగూడ నీదోషము లేకపోలేదు. కాని యీతనికల్పనలు కృత్రిమము లనకతప్పదు. అసలు కవిత్వమే కృత్రిమకళ యని యంగీకరింప వలయు. కవితాసత్యము వేఱు, యథార్థప్రపంచసంఘటనము వేఱు. ఇట్టి యుత్ప్రేక్షాతిశయోక్తులతోఁ గూడిన కవితాశిల్పమున నన్నె చోడుఁడు చక్కని స్వభావోక్తులతోఁ గూడిన వర్ణనలుగూడ చేసి సన్నివేశములను గన్నులకుఁగట్టినట్లు చేసినాఁడు. ఇట్టి యీతని యాటవిక వర్ణనలు, యుద్ధవర్ణనలు, విప్రలంభశృంగారము మొదలైనవానియందుఁ గాననగును. ఇందుచేతనే శ్రీ లక్ష్మీకాంతముగారు "ఈ రాజకవి ఆంధ్ర కవులం దుత్తములలో లెక్కింపఁదగినవాఁడే కాని సామాన్యుఁడు గాఁడు. కుమారసంభవమున నేపద్యము చూచినను మిక్కిలి స్వతంత్రమును, రమణీయమునునైన భావ ముండుట, ఆభావము అపేలవము, మధురము నైన పదములలో వ్యక్తమగుట........స్పష్టమగుచుండును" అది

వ్రాయుపలసివచ్చినది. కాని శ్రీలక్ష్మీకాంతముగారి విమర్శనవాక్యములు పరస్పరభేదము గల్గి పొందిక కుదరకయున్నవి.

(3) "రెండుగ్రంథాలయందును కథాప్రణాళిక ఒకటే. అయినప్పటికీ ఆప్రణాళికను ఉన్మీలనం చేయడంలో మాత్రం నన్నెచోడుడు కాళిదాసుకంటె నెక్కువ పెంపుచేశాడు. ఈపెంపు అనేకవిధముల జరుగుతుంది. కాని ముఖ్యంగా వస్తువర్ణనలోను, భావవర్ణనలోను అది యెక్కువ ద్యోతిత మవుతుంది.........ఈపెంపు జరిగినకొలదీ లౌకిక గ్రంథము విస్తృతి జెందటమేకాకుండా కొన్నికొన్నిచోట్ల ఆవిస్తృతి కథనదృష్ట్యా అనావశ్యకముకూడ అవుతుంది. మరికొన్నిచోట్ల సూచనామాత్రంగా వ్యంగ్యప్రధానమైన అర్థం, వివరణమువల్ల పలచబడుతుంది." అని శ్రీ లక్ష్మీకాంతముగారి ప్రసంగము పెంపుచేయువిధానము వారుచెప్పినారు. బాగుగానే యున్నది. కథనదృష్ట్యా ఆవిస్తృతి కొన్నిచోట్ల ననవసరముకూడా నగుననియు, సూచనామాత్రముగా వ్యంగ్యప్రధానమైన యర్థము వివరణమువలన పలుచఁబడు ననువిషయము మాత్ర మా కవి శక్తిసామర్థ్యములపై నాధారపడియుండును. శక్తిహీనుఁడగు కవిచేతిలో నెంతరసవంతమైనసన్నివేశముగూడ నీరసముగానే తయారగును. సామాన్యులకు కథనదృష్ట్యా విస్తృతి యనవసరమనిపించు కొన్నిచోట్లలో సమర్థుఁడగు కవి కవసరమే యని తోఁచి, వానిని తనరచనాసామర్థ్యమువలన చమత్కారముగా వర్ణింపవచ్చును కదా. ఉదాహరణమునకు, మారన రచించిన మార్కండేయపురాణమందలి స్వారోచిషమనుసంభవకథను గ్రహించి యల్లసాని పెద్దన మనుచరిత్రమును బహురసవంతముగా పెంచి వ్రాసినాఁడు. మారనరచనమును చదువునపు డొకవిధమైన సంతృప్తిని పొందుచునేయున్నాము; కాని కథనలోపమునుమాత్ర మనుభవింపము. అవసరమైన కథనమంతయుఁ గలదనే తలంచుచున్నాము. కాని యాకథాప్రణాళికయేకల

యల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రను చదువునపు డనేక నూతనవిషయములు కథనరీత్యా కల్పింపఁబడిననుగూడ నవి మన కనవసర మని తోఁపకుండుటయేకాక, యవి యత్యవసర మనికూడ తోఁపింపఁజేయును. ఈమార్పు ప్రతిభావంతుఁడైన కవిచేతిలో నున్నది. ఐంద్రజాలికునివలె కవి పాఠకులదృష్టిని మార్చివేయును కదా. ఇది మనుచరిత్రవలన మనకు ప్రత్యక్షానుభవమే. ఇట్లే భారతమందలి నలోపాఖ్యానమునకు శ్రీహర్షుని నైషధకావ్యమునకుఁ గల సంబంధము. ఈవిషయమునే అరిస్టాటిలు (Aristotle) గూడ తన పోయటిక్స్(Poetics) అనేగ్రంథములో చక్కఁగ వివరించి చెప్పెను. మఱియు నిట్టిపెంపువలన రచన పలుచఁబడుననుట కూడ నంతయే. కవితాభావములును, వానిని వ్యక్తీకరించుభాషయు స్నిగ్ధగంభీరములుగను, నపూర్వముగ నుండునంతవఱకు కవితారచన పలుచఁబడుననుటకు సరసులు సమ్మతింపరు. శక్తిహీనుఁడగువాని చేతిలో పలుచఁబడుట సహజమే. దీనికిఁగూడ మనుచరిత్రమే చక్కని తార్కాణము. అల్లసాని పెద్దనార్యుఁడు మార్కండేయపురాణములో లేని యెన్నివ్యంగ్యరచనలను "ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర" మొదలైనవి కల్పింపలేదు ? ప్రస్తుతము శ్రీలక్ష్మీకాంతముగారే యీప్రసంగమున నుదాహరించిన సంస్కృతాంధ్రకుమారసంభవశ్లోకపద్యములను వివరించుచు నిట్లు చెప్పినారు. "ఈ (కాళిదాస) శ్లోకములోని భావాలనే ఛాయామాత్రంగా అనుకరిస్తూ నన్నెచోడుడు మూడు పెద్దపద్యాలు వ్రాశాడు. మూడవదానిలో పార్వతి కోసి తెచ్చిన పువ్వులు ప్రత్యగ్రములని చెప్పటానికి ఆ ప్రత్యగ్రతయొక్క స్వరూపాన్ని వివరిస్తూ, రమణీయతరమైన యొక యర్థాన్ని కొని తెచ్చాడు. (ఆ సీసపద్యమిది)

సీ. మొవ లావులించి వాసన సల్ల బసిగొని
లేఁదేటిగము లెంగిలింపకుండ

సెడ సూరగాని వేచి సుడియు తెమ్మెరలచేఁ
బొడము పుష్పాడి నోలివోవకుండఁ
దరణికూటమున మే యెరలి పద్మినిమేన
మొలతెంచు మధుమద మొలుకకుండ
మేల్కాని గోమిని మెలఁగి మై మురిసిన
బొదిగొన్న యకరువుల్ సెవరకుండఁ
తే. దెలిసి జక్కవ లొండొంటిఁ గలయు దారు
కలకలంబున రేకులు గదలకుండ
మున్న కొనివచ్చి గణికాసమూహితోడ
గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు.

నిజంగా యీపద్యం కాళిదాసే చూచివుంటే సంస్కృతములోకి అనువదించేవాడేమో ననిపిస్తుంది. కాళిదాసునే మురిపించే పద్యాలు యిట్టివి యీగ్రంథములో అక్కడక్కడ చాలా ఉన్నాయి.'' ఇంతగా నన్నెచోడునిరచనను మెచ్చుకోఁగలిగియుండియుఁగూడ శ్రీలక్ష్మీకాంతము గారు చోడకవిని గాళిదానుతో సమానునిగాఁ జూడలేకపోవుచున్నారు. నన్నెచోడుని రచనయందుఁ గాళిదాసున కుండఁగలదన్నంత గొప్ప మెప్పు వీరికి లేదేమో! పోనీ, కథనదృష్ట్యా యనవసరమైన విస్తృతి గల ఘట్టములుగాని, వ్యంగ్యప్రధానమైన యర్థమును వివరించి పలుచ పఱచిన సన్నివేశములుగాని నన్నెచోడుని రచననుండి యుదాహరణల నైన వీరు చూపలేదు.

తరువాత కథనదృష్ట్యా యనవసరమైన విస్తృతిని నిరూపించుటకే కాఁబోలు మన్మథుఁడు శివుని తపోవనమును బ్రవేశించునపుడు కాళిదాసు వ్రాసిన యొకశ్లోకమును జదివి, ''ఇందులో అతడు వాహనారూఢుడయ్యే వెళ్లాడో, కాలినడకనే వెళ్లాడో, ఆకాశగమనాన్నే వెళ్లాడో కాళిదా సేమీ వివరింపలేదు. ఆ గమనప్రకారాన్ని అవసర

మైతే మనం ఊహించుకోవలసినదే కాని, దానిని వివరించిచెప్పటం ఆకవికులగురువుయొక్క పద్ధతి కాదు. కాని, నన్నెచోడుడు మనం ఊహించుకోవలసిన భారం లేకుండానే రతి మన్మథులు వసంతునితో పుష్పరథమెక్కి వెళ్లారని చెబుతూ, ఒక అతిలోకసుందరమైన పుష్ప రథాన్ని సృష్టించి, ప్రదర్శించాడు. రథానికి చక్రాలు, ఇరుసు, కాడి మొదలైన యవయవాలు యెన్నియుంటాయో, అన్నిటికి అన్నిరకాల పువ్వులను సంపాదించి, ఆ రథనిర్మాణం చేసిన యీ తెలుగుకవినేర్పు యెంతె శ్లాఘాపాత్ర మవుతుంది. కాని, ఆ రథనిర్మాణ మెంత బాగున్నా ఆ పద్యంమాత్రం చమత్కారభూయిష్ఠమే కాని, రసవంత మని చెప్పదగిన రామణీయకభూయిష్ఠము కాదు" అని లక్ష్మీకాంతము గారు నిర్ణయించినారు. మఱియు "ఈ చమత్కారపద్యాలు వ్రాయ టం సంస్కృతకవులలోకూడా ఉత్తరకాలమందలి శ్రీహర్షాదులకు అల వాటైంది గాని, అశ్వఘోషకాళిదాసులనాడు లేదు. ఏకవిగాని, ఏ వాఙ్మయముగాని రమణీయార్థములను గాక, చమత్కారార్థములను భావించడానికి మొదలుపెడతారో ఆకవి-ఆవాఙ్మయము క్షీణమార్గాన్ని పట్టిందనే జంకులేకుండా చెప్పవచ్చును. ఈ చమత్కారార్థమువల్లనే కావ్యరచనలో ఉత్ప్రేక్షలు, అతిశయోక్తులు యెక్కువ అవుతాయి." అనికూడా చెప్పినారు. ఈవిషయముగూడ కొంచెము పరామర్శింతము.

కాళిదాసు తనకావ్యములం దంతటను మొదటినుండి చివర దాక రమణీయార్థప్రతిపాదకమును జేయలేదనియు, వలసినచోట్ల నుత్ప్రే క్షాతిశయోక్త్యాద్యలంకారములతో చమత్కారార్థరచనమునుగూడఁ జేయకపోలేదని హిమవత్పర్వత, పార్వతీవర్ణనాదులనుబట్టి బుధు లంగీక రింపకపోరు కదా. అట్లే శ్రీహర్షనైషధాదికావ్యములందు నలదౌత్యాది సన్నివేశములందు రమణీయార్థప్రతిపాదకత్వము విశేషముగా నిర్వ హింపఁబడిన దనికూడ సరసు లంగీకరింతురు గదా. కాఁగా కాళిదాసు

కావ్యములందుకంటె శ్రీహర్షాదికావ్యములం దుత్ప్రేక్షాతిశయోక్తులు గల చమత్కారార్థరచన లధికముగాఁ గలవని యందఱు నేకగ్రీవముగా నొప్పుకొనువిషయమే. ఇట్టిస్థితిలో శ్రీహర్ష నైషధాదికావ్యములందుఁగల రమణీయార్థప్రతిపాదకత్వము పరిగణింపక, యందలి చమత్కారార్థరచనలనుమాత్రమే యుగ్గడించి 'ఆవాఙ్మయము క్షీణమార్గాన్ని పట్టిందనే జంకులేకుండా చెప్పవచ్చ'ని నిర్ణయించుట సముచితము గాదేమో! శ్రీహర్షనైషధాదికావ్యములందు రమణీయార్థప్రతిపాదకత్వము సమానముగాఁ జమత్కారార్థరచనముఁగూడ నాయాస్థలములందుఁ దగినట్లుగ నిర్వహింపఁబడిన దని గుర్తించియే మన భారతీయాలంకారికులును విమర్శకులు, వ్యాఖ్యాతలును "నైషధం విద్వదౌషధ" మనియు, ప్రౌఢకావ్య మనియు ప్రశంసించి, కాళిదాసు కావ్యములతోఁబాటు పంచకావ్యములలోఁ జేర్చిరి. కాని యాకావ్యమందలి రమణీయప్రతిపాదకత్వము లేక కేవలము చమత్కారార్థరచనలుమాత్రమే యున్నచో శ్రీ లక్ష్మీకాంతముగారు తలఁచినట్లు వాఙ్మయము 'క్షీణమార్గానపట్టిం' దని చెప్పవచ్చును. రమణీయార్థప్రతిపాదకత్వముతోఁబాటు చమత్కారార్థరచనలుఁగూడఁ గల కావ్యములు క్షీణదశకుఁ జెందినవనుట సరసు లెంతమాత్రము సమ్మతింపరేమో! కవులప్రతిభ యనేకవిధములుగా నుండును. అపూర్వకథాకల్పనాశక్తి కొందఱికి, రమణీయార్థప్రతిపాదనము మఱికొందఱికి, అర్థచమత్కృతి యింకఁగొందఱికి ని ట్లనేకవిధములుగ, వివిధకాలములలో భాసించి పాఠకులకు విగళితవేద్యాంతరమైన బ్రహ్మానందము గల్గించును. మానవాతీతవిషయములతోడను పూర్వకథాకల్పనలతోడ నిండిన పురాణములతో విసిగిపోయి కవులు కావ్యరచనకు ప్రారంభించి, చమత్కారార్థకల్పనలను సాగించిరి. ఇందు తమ భావనాశక్తిని ప్రదర్శించి కవులు పాఠకుల కానందోత్సాహములను రేకెత్తిం

చిరి. ఇదే కవితాసృష్టి యని ఖ్యాతి గణించినది. నూత్నభావముల గణించుశక్తి లేనిచోఁ గవియేకాడని తలంపఁబడినది. ప్రతిభావంతులైన కవులు దమ భావనాశక్తివలన జగత్త్రియము నుచ్ఛిష్టముచేయుటచే, (బాణోచ్ఛిష్టం జగత్త్రియం) శక్తిహీనులగు కవినామమాత్రులు పూర్వకవుల భావదాస్యముతో ననుకరించు నూత్నభావములను గల్పింపకపోవుటచే, వారికవిత్వము క్షీణదశకు చెందినది. అప్పటినుండి రసప్రతిపాదకార్థరచనలందును, ఉత్ప్రేక్షాతిశయోక్తులమీఁదను విసుగు, రోఁత జనించినది. అందుచే మన మిప్పుడు నిరలంకారరచనలకే ప్రాధాన్య మిచ్చుచున్నాము. ఈవిధముగఁ గవితాభిరుచులు కాలక్రమమున మాఱుచుండ, చమత్కారార్థరచనలు గౌరవాదరములు చూరగొన్నకాలమున రచింపఁబడిన కావ్యప్రబంధములను గావ్యలక్షణదృష్టితో విమర్శింపక, నేఁటికాలపు కావ్యలక్షణదృష్టితో నాకావ్యములను విమర్శించుట సముచితముగ నుండదు. పురాణములను కావ్యదృష్టితోడను, నేఁటికాలకవిత్వమును ప్రబంధలక్షణదృష్టితోడను విమర్శించినచో నిట్టియుపద్రవమే సంభవించును. కావ్యసంప్రదాయముల నిర్వహించుచు నుత్తమకవిత్వమును గావ్యకవి చెప్పగల్గినాఁడా లేదా, యని విమర్శకుఁడు పరిశీలింపవలెఁగాని, యాకావ్యసంప్రదాయములే దుష్టమని విమర్శించుట కావ్యార్హతను నిర్ణయింపదు. కావ్యసంప్రదాయములగు నుత్ప్రేక్షాతిశయోక్త్యాద్యలంకారములతోడఁ జమత్కారార్థరచనలను సామర్థ్యముతోఁ గవి ప్రశస్తముగ నిర్వహించినాఁడా, లేదా యనిమాత్రమే విమర్శకుఁడు పరిశీలింపవలయును. గాయకుఁడు సంగీతశాస్త్రవివిధాంగములగు రాగము, గీతము, కృతి, పల్లవి, తానము మొదలైనవానియందుఁ దనకుఁగల ప్రావీణ్యమును, గానకళాప్రదర్శనమునఁ బ్రదర్శించునపుడు, వివిధాంగములను శక్తిసామర్థ్యములతో నతఁడు చక్కఁగ నిర్వహించెనా,

లేదా, యని పరిశీలించి ప్రాడ్వివాకు లతని ప్రతిభను నిర్ణయించుట సముచితము కాని, కొన్ని సంగీతశాస్త్రాంగములు విమర్శకుల కిష్టము లేకుండిన, వాని నాతఁ డేల ప్రదర్శింపవలెననియే సరసుఁడగు విమర్శకుఁ డైన దోషారోపణము సేయునా? ప్రదర్శనములో లోప మున్నదా, యని విచారించునా? శ్రీ లక్ష్మీకాంతముగారు తెలిపినట్లు చోడకవి తనకావ్యమునఁ గాళిదాసునిగూడ మెప్పింపఁదగిన పద్యములను వ్రాసినాఁడు కొన్నిచోట్ల. మఱికొన్నిచోట్ల కాళిదాసునివర్ణనలకు మెఱుఁగుపెట్టుచు నతని మించవలెనని విస్తారమైనవర్ణనలు చేసినాఁడు. కాళిదాసు కుమారసంభవకథను ప్రపంచించుచుఁ గొన్ని నూతనసన్నివేశములను కల్పించినాఁడు. ఇంకఁ గొన్నిచోట్ల నూత్నవర్ణనలఁ జేయుచు మచ్చుచూపినట్లుగను, ప్రబంధసంప్రదాయానుగుణముగ నాసందర్భమును పాటించి బంధ, చిత్ర, గర్భకవిత్వములనుగూడ రచించినాఁడు. ఇది యాంధ్రమునఁ బ్రథమప్రబంధ మగుటచే వీనిని కవి గ్రుడ్డిగా ననుకరించి భావదాస్య మొనర్చినాఁ డనరాదు. అట్లే యుత్ప్రేక్షాతిశయోక్త్యాద్యలంకారములతోఁ జమత్కారార్థరచనలను గావించినాఁడు. ఈవిధముగ వివిధమైన కవితాపద్ధతులను, వివిధమైన మార్గముల సంస్తవనీయముగ నొనర్చి భావికవులకు మార్గదర్శకుఁడైనాఁడే కాని, ప్రతిభాశూన్యమైన యంధానుకరణము చేయలేదు. కవితాసామర్థ్యము ననేకవిధముల ప్రదర్శించిన యీప్రబంధకవిరచనలలోఁగల వైవిధ్యవిశేషములను గుర్తించి, సమన్వయించి మెచ్చుకొనుటకు మాఱుగా "ఈకావ్యము రెండు విరుద్ధాంశములకు సంగమస్థానమేమో అనిపించు" నని వ్యాఖ్యానించుట నా రెండంశములను సమన్వయింపఁ జూడకపోవుటయే యనిపించును. ప్రబంధమును రచించుచుఁ బ్రబంధలక్షణములను సంప్రదాయములను పాటింపకుండ నేకవియైన వ్రాయఁ గలఁడా? అంతమాత్రముచే క్షీణయుగములోని క్షుద్రప్రబంధలక్షణము

లగునా ? ఈ విరుద్ధాంశద్వయము చోడకవిసృష్టిలోనివి కావు. మొట్ట మొదటనే యీచోడకవిని జిన్నచూపు చూచి కాళిదాసుతోఁ బోల్చుట, తర్వాత నీప్రబంధమును ప్రబంధలక్షణములతోఁ బరిశీలింపక పురాణకవితాలక్షణములతోఁ బరీక్షించుట, ప్రబంధలక్షణములను కవితాలక్షములతో సమన్వయింపకపోవుటయు వీరి విమర్శ విరుద్ధాంశములకుఁ గారణమైనది.

(4) "వస్త్వైక్యమున కొంత లోపమున్నను ఈ కుమారసంభవమే యథార్థముగా మన ప్రథమప్రబంధము" అని శ్రీ లక్ష్మీకాంతము గారు వెనుకఁ దెల్పిన యాంధ్రసర్వస్వములో వ్రాసిరి. కాన, నావిషయమందలి యాథార్థ్యము గొంత విచారింపవలసి యున్నది. నన్నెచోడుని కుమారసంభవమున మొదటి రెండాశ్వాసములందుఁ గల గజానన జన్మము, దక్షాధ్వరధ్వంసవృత్తాంతములు ప్రధానకథకు సంబంధము లేనివనియు, నందుచేఁ గావ్యమున వస్త్వైక్యము చెడినదని సామాన్యముగా స్థూలదృష్టితోఁ జూచిన కొందఱికిఁ దోఁచును. కాని సూక్ష్మముగా నాలోచించినపుడు మొదటి రెండాశ్వాసములకథ ముఖ్యమే యనిపించును. ఎట్లన, తృతీయాశ్వాసమున నీశ్వరుఁడు తప మాచరించుటకుఁ గారణముగ నిట్లు తెలుపఁబడినది.

గీ. సతివియోగాగ్ని మనములో సంతతంబుఁ
దగిలికొని కాల, దానికిఁ దనుపు సేయఁ
దలఁచియో, కాదు నిక్కము దపము సేయ
వలచియో హిమగిరికి నీశ్వరుఁడు వచ్చె.

(iii)–87

ఇట్లే సంస్కృతకుమారసంభవమునఁ గాళిదాసు,

శ్లో॥ యదైవ పూర్వే జననే శరీరం సా దక్షరోషా త్సుదతీ ససర్జ
తదా ప్రభృత్యేవ విముక్తసంగః పతిః పశూనా మపరిగ్రహోఽభూత్ ॥

(i)—33

"దక్షాధ్వరమునఁ గోపముచే సతీదేవి యెప్పుడు దేహమువదలెనో, యదిమొదలు పరమేశ్వరుఁడు విషయాభిలాష విడిచి యితరస్త్రీయందు వాంఛ లేకయుండె" నని తెలిపెను. మఱియు మేనకాహిమవంతులు శక్త్యారాధనఁ జేసి "సతీదేవి తమ కామె కూఁతురై జన్మింపఁగ బరమ భక్తియుక్తినారాధించినం, గరుణించి నిజదేహవిదాహకరంబైన కోపానలంబునకుం, బరమేశ్వరువియోగానలంబునకు శిశిరోపచారంబు సేయఁ దలఁచినదియుఁ బోలె హిమవంతంబునకుం జనుదెంచి దాక్షాయణి ప్రత్యక్షంబై వారి కోరినవరంబు దయచేసి, పరముదేహార్ధంబు మెయి మెయి గయికొనందలంచి, పరమపవిత్రంబైన మేనకాదేవి గర్భంబునం దవతరించె." ((iii)–23) అని నన్నెచోడుఁడు రచించినాఁడు. ఇట్లే కాళిదాసు తన సంస్కృతకుమారసంభవమున,

శ్లో॥ అథావమానేన పితుః ప్రయుక్తా దక్షస్యకన్యా భవపూర్వపత్నీ
సతీ సతీ యోగవిసృష్టదేహా యం జన్మనే శైలవధూం ప్రపేదే॥
(i)—21

"తనతండ్రియగు దక్షుఁడు పరమేశ్వరుని నిందించుట కోర్వనిదై యోగముచే విడిచినశరీరముగల సతీదేవి మైనాకుని పుట్టుకకునంతరమున నామేనకను బొందె" నని తెలిపెను. కానఁ బార్వతి పూర్వావతారమగు సతీదేవిచరిత్రమును, దక్షాధ్వరధ్వంసము మొదలగునవి తెలుపుట స్పష్టతకొఱ కవసర మనిపించును. ఆయవకాశమునుగ్రహించి గజాననవృత్తాంతమునుగూర్చి కవి చమత్కరించినాఁడు. ఇందుచే దక్షాధ్వరధ్వంసవృత్తాంతము కథ కైక్యమును గూర్చుచుఁ బుష్టిని, పూర్ణత్వమును గల్గించుచున్న దనియే చెప్పవలయును. కాళిదా సాభాగమును వర్ణింపనంతమాత్రమున నది యనవసరమై వస్త్వైక్యమును పాడుచేసిన దని యేల యనవలె.

ఈకావ్యమందలి దీర్ఘవర్ణనలు వస్త్వైక్యమునకు భంగము గల్గించినవని వాదించుచో, మను వసుచరిత్రాదిప్రబంధములందువలె దీని

యందు నున్నదని చెప్పవలెఁ గాని విశేషము లేదు. కాన ప్రబంధ దృష్టితోఁ జూచినచో దీర్ఘవర్ణనలు వస్త్వైక్యమునకు భంగము లని చెప్పరాదు. పార్వతీపరమేశ్వరులకు సంబంధింపని యితరకథలు, ఆముక్తమాల్యద యందువలె, నిందుఁ గానరావు.

(5) "అనౌచిత్యాదృతే నాన్యద్రస భంగస్య కారణ" మ్మని యాలంకారికులు చెప్పినారు. కాని యీకాలమున నభిరుచులు మాఱుచుండుటచేతను, "లోకోభిన్నరుచిః" యగుటచేత, నొకరి కుచితముగఁ గనఁబడుచున్నవిషయము మఱియొకరి కనుచితముగాఁ దోఁచుచున్నది. అట్లే యొకరి కనౌచిత్యముగా నున్నది మఱియొకరి కౌచిత్యముతోఁ గూడియున్నట్లు కనుపించును. దీనికి వారి వారి చిత్తసంస్కారమే ముఖ్య కారణ మని గ్రహింపవలయును. "మనువునిశ్చయమునకు వెళ్లివచ్చిన సప్తఋషులు పెండ్లికూఁతురు చాల అందకత్తె యని శివునితో, జగన్మాతగాఁబోవు నామె యవయవములను వర్ణించిచెప్పుట యేమాత్ర ముచితము గాదు. ఆలాగే శివునిమీఁదికి వెళ్లు మన్మథుని వారించుటకు రతి చేసిన హితోపదేశముగూడా ఔచిత్యపుమేరను మీఱుచునే యున్న దని (శ్రీ) లక్ష్మీకాంతముగారు వెనుకఁదెలిపిన రేడియోప్రసంగమునఁ జెప్పినారు. కాన నీవిషయమును గొంత పరామర్శింతము.

(౬) ప్రబంధములు కథ నాలంబనముగాఁజేసికొని, కవికల్పనా శక్తిని ప్రదర్శించుటకు వినియోగింపఁబడినవి. కాన ప్రబంధకవులు స్త్రీల యవయవము లనేకవిధములఁ జమత్కారముగ వర్ణింతురు. కావ్యమందలి నాయికానాయకులు దేవతలైనను మానవులుగఁ బ్రతిపాదింపఁబడి, మానవు లాకావ్యమును జదివి యానందించునట్లు, మానవభావములే వారి కారోపింపఁబడును. కాన దేవతలు, నవతారపురుషులు, జగన్మాతలు, జగత్కర్తలును మానవాతీత భావములతోఁ జిత్రింపఁబడరు. అందుచేతనే మానవేతరుఁడైన హిమవత్పర్వతము, మేనకను

వివాహమాడుట, మఱియొకపర్వతమును గనుట, మఱియొకమాఱు పార్వతినిగనుట మొదలగువిషయములు కథయందున్నను, వారందఱికిని మానవభావములనే కల్పించి, వారిని మానవులుగానే కవులు చిత్రించిరి. ఎందులకనఁగా నీకావ్యములు మానవులకొఱకు రచింపఁబడినవి కాని, మానవేతరులకుఁ గాదు కదా! కాన మానవభావములే వారి కారోపింపఁబడును. మధ్యమధ్యమాత్రము కథాసరళినిబట్టి వారు మానవేతరులుగాఁ దెల్పఁబడుదురు. ఇట్లు మిశ్రమముగాఁ గూడ కథాపాత్రలు చిత్రింపఁబడుదురు. ఇట్టిచోఁ బార్వతి జగన్మాత గాన నామెను నఖశిఖపర్యంతము శివునిసన్నిధిని వర్ణించుట యనౌచిత్యమని వాదించుటలో నర్థమేమిఁటి? జగన్మాత కాకపోయినను వరునిసమక్షమున వధువునుగూర్చి ప్రత్యవయవమును పచ్చిగా వర్ణించిచెప్పుట యుచితమేనా! పోనీ జగన్మాతప్రత్యవయవమును పాఠకులకైనను పచ్చిగా వర్ణించి కవి చెప్పుట యుచితమేనా? అట్లు కాళిదాసే వర్ణించెనుకదా! కవికులగురువగు కాళిదాసే యట్లనుచితముగ వర్ణించుటలోఁగల పరమార్థమేమి? తన వర్ణనాచమత్కారశక్తిని ప్రదర్శించుటయే కదా. కాన నన్నెచోడునివర్ణనలఁగూడ నాయర్థమునన గ్రహింపవలెఁ గాని, యనౌచిత్యమని వాదింపరాదు. ఈశ్వరుఁడు పార్వతిని పరీక్షాసందర్భమున, వటురూపముతోఁ జూచియే వచ్చెను కదా. అట్టవానికి ఋషులు తెలుపనేల? అనవసరము కదా. ఇట్లు వాదించుచో సమాధానమే యుండదు. శ్రీరామచంద్రుఁడు భగవదవతారపురుషుఁడై సీతావియోగమున సామాన్యమానవునకంటె హీనముగా విలపింప నేల? ఆమెను దెచ్చుటకై కపిసైన్యమేల? మొదలైన శంక లిట్టివే. ఇందుచేతనే ప్రబంధమును ప్రబంధదృష్టితోఁ జూచి పరీక్షింపవలె నని పైని దెలిపితిని.

(బి) ఇఁక శివునిపైఁ బోఁజూచు మన్మథుని నివారించుచు రతి పల్కినమాటలుగూడ నుచితముగ లేవనుట. అధర్మము సేయఁబోయి

యాత్మనాశనముఁ దెచ్చికొనఁబోవు భర్త కనేకవిధముల నయమునను, భయమునను నీతి చెప్పి, తత్కార్యమునుండి మఱలింపఁజూచుట భార్య కుచితధర్మము. ఇట్లు రావణాదులకు మండోదర్యాదులు ధర్మ ముపదేశించినట్లు పురాణములందుఁ గలదు. అట్లే తపముచేయుచున్న శివుని పైఁ బోవనున్న మన్మథునికి భయభక్తులు చెప్పి, మఱలింపఁ బ్రయత్నించినది. ఇం దాచితి మేర నెట్లుదాఁటినదో తెలియరాదు. ఆమె భర్తను దూషింపలేదు. అతని యథార్థశక్తిసామర్థ్యములు తెలియ నతనిశక్తిని శివునిశక్తితోఁ బోల్చిచెప్పినది. మొట్టమొదటఁ బరమేశ్వరునిపై భక్తి భావముతో మఱలింపఁజూచినది. ఇట్లాతని ప్రేరేపించిన దేవేంద్రుని కృతఘ్నతను, కపటమును దూలనాడినది. మన్మథునిపై ననూయతో నింద్రుఁ డాతని మరణోపాయమును వెదకెనా యని యాశంకించినది. శంకరునిఁ బూర్వము దిరస్కరించిన బ్రహ్మవిష్ణు యముల గతి నుదాహరించి చూపినది. ఎంతచెప్పినను లాభము లేకపోయినది. ఈసన్నివేశము చక్కని సంభాషణరూపమునఁ దేటతెలుఁగు మాటలతో నిరలంకారముగ, స్వభావోక్తితో నారోహణక్రమమునఁ గూర్పఁబడినది. ఇట్టిదాని నౌచితిమేర దాఁటిపోయిన దని శ్రీ లక్ష్మీకాంతముగారు విమర్శించుట న్యాయముకాదు. వలయువా రాభాగమును కుమార సంభవమున, ఆ IV, 61–81 పద్యములను మఱియొకమాఱు పరిశీలింతురుగాక– ఈసన్నివేశము కాళిదాసకుమారసంభవమునందు లేదు. అందు,

శ్లో॥ తథేతి శేషా మివ భర్తురాజ్ఞా
మాదాయ మూర్ధ్నా మదనః ప్రతస్థే
ఐరావతాస్ఫాలన కర్కశేన
హస్తేన పస్పర్శ తదంగ మింద్రః॥

శ్లో॥ స మాధవేనాభిమతేన సఖ్యా
రత్యాచ సాశంక మనుప్రయాతః
అంగవ్యయప్రార్థిత కార్యసిద్ధిః
స్థాణ్వాశ్రమం హైమవతం జగామ॥

ఇంద్రునియాజ్ఞ శిరసావహించి మన్మథుఁడు రతీవసంతులతో శివుని తపోవనమున కేగినట్లు కాళిదాసు రచింపఁగ, నన్నెచోడుఁడు దేవేంద్రునియానతిఁ గైకొని మన్మథుఁ డింటికి బయలుదేరె ననియు, నింతలో రతి తనయింటిలో దుశ్శకునములు గాంచి దిగులుచెంది, భర్తకై నిరీక్షించుచుండఁగా, నాతఁడు వచ్చె ననియుఁ, దగ్వాత వారిరువురకు సంభాషణము జరిగెననియు వర్ణించినాఁడు. ఇందు నన్నెచోడుఁడు చేసిన మార్పు సంభావ్యము గాదని యెవ్వ రనలేరుగదా. ఇది చోడ కవి కథను ప్రపంచించినవిధానము. తన క్షేమమును, దన భర్త శ్రేయస్సును గోరి రతి సహేతువుగ వాదించుచు, మన్మథుని శక్తికిని శివుని శక్తికిఁ గల తారతమ్యమును జూపి, "అతనికి నీకు హస్తిమశకాంత మెమ్మెయి నెన్నిచూచినఁ" IV, 72, "కాని బాలురైనను దినిపిప్పి యుమిసెడు చెఱకు విల్లని నమ్మి చేతఁ బట్టి" 75, అని పల్కుటలో నా యనౌచిత్య మున్న దనుభ్రాంతి? ఇది సత్యముమాత్రమే కాక, భర్తను రక్షించుకొనఁదలఁచిన యామె ధర్మముగూడ "హితం మనోహారిచ దుర్లభం వచః" అని యెంచి హితమును బోధించినది. కాన నిం దనౌచిత్య మెంతయు గోచరింపదు. కోరాడ రామకృష్ణయ్యగారు కుమారసంభవపీఠికలో (చూ. పుట XLIII) నిట్లు వ్రాసిరి. "రతిమన్మథ సంవాదము. ఈశ్వరునిపై నెత్తఁదలఁచిన యాతని కామె హితవు చెప్పఁబూనుట, తుద కది 'యాడుబసిపని'గాఁ దలంపఁబడుట—వీరి వాదమునఁ గవి చూపిన జాణతనము ప్రశంసనీయము. ఈసంఘటన మును సామాన్యదేశీయకుటుంబములలో నాలుమగలకు జరుగుసంభాషణవలె నడిపినాఁడు కవి.

(6) నన్నెచోడుని భాషనుగూర్చి శ్రీ లక్ష్మీకాంతముగారు పైనఁదెల్పిన రేడియోప్రసంగమున నిట్లు చెప్పిరి. "సంస్కృతభాషలోఁ గాళిదాసుశైలి యెంతప్రసన్నముగా నుండునో, తెలుగుభాషలో నీ కుమారసంభవ మంతప్రసన్నము గాదు. ఈతని భాష యిప్పటికి చాల పాతకాలపుభాష అయినది కనుక మనకు అప్రసన్నముగా కన బడవచ్చునని కొంత సమాధానము చెప్పికొందము. అయినను ఈతని భాషలో ఆనాటికే ప్రాతవడ్డమాట లెక్కువగా నున్నవని తండోప తండములుగా నుదాహరణములు చూపవచ్చు. ఇంతకంటె డెబ్బది యెనుబదిసంవత్సరాలు పూర్వుఁడుకదా నన్నయకవిత్వములో నుండెడి ప్రసన్నత యీతని కవిత్వములో లేకపోవుటకు గారణమేమిటి? ప్రాత వడ్డమాటలు వాడుటే. తిక్కన నిర్వచనోత్తరరామాయణపీఠికలో 'పలుకులపొందు లేక రసభంగము సేయుచు ప్రాతవడ్డమాటల తమ నేర్పుచూపి' అని చేసిన యీసడింపు నన్నెచోడుని, పాల్కురికి సోమ నాథుని గురించి చేసినదే. ఆనాడేమిటి, ఈనాడేమిటి పూరుమూాల పదములతో, ప్రాతవడ్డమాటలతో చెప్పు కవిత్వము లన్ని యిట్టినిందకే పాల్పడును. కావ్యములోని గ్రామ్యతాదోషాలలో ప్రాతవడ్డ శబ్దాల ప్రయోగ మొకటని పాశ్చాత్యవిమర్శకు లనెదరు. దీనినే మన అలం కారశాస్త్రములు అప్రసిద్ధపదప్రయోగ మనుపేరుతో కావ్యదోషా లలో పరిగణింతురు. కాని "కుమారసంభవమున నేపద్యముచూచి నను మిక్కిలి స్వాతంత్రమును, రమణీయమునైన భావము లుండుట, ఆభావము అపేలవము, మధురమునైనపదములలో వ్యక్తమగుట, ఆపదములలో నెక్కువపాలు జాను తెనుగనిపించుకొను దేశ్యపద జాలమే యగుట స్పష్టమగుచుండును." శ్రీ లక్ష్మీకాంతముగారి పై రెండభిప్రాయములలోఁగూడఁ బరస్పరవైరుధ్యము గనుపించుటలేదా? ఆంధ్రసర్వస్వములో నీతని భాషను గూర్చినమెప్పు ద్యోతక మగు

చుండ, వారు రేడియో ప్రసంగమున గర్హించినట్లు తోఁచుచున్నది. "పలుకులపొందు లేక" యని తిక్కనచేసిన యాసడింపు నన్నెచోడ, పాల్కురికి సోమనాథులనుగూర్చియే యని వీ రెట్లు నిర్ధారణ చేయఁ గల్గిరో తెలియరాదు. పాల్కురికి సోమనాథుఁడు తిక్కన తర్వాత వాఁడుగదా. పాల్కురికి సోమనాథుని కాలమునుగూర్చి డా. చిలుకూరి నారాయణరావు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, డా. నేలటూరి వేంకటరమణయ్య, వేటూరి ప్రభాకరశాస్త్రి మొదలైన పండితులందఱు ఇందులూరి అన్నయమంత్రియొక్క శాసనాదులనుబట్టి ద్వితీయ ప్రతాపరుద్రుని కాలమువాఁడనియు, నంతకేనాఁడో పూర్వమే తిక్కన యుండెననియు నిర్ణయించిరి. పోనీ, తిక్కనకుఁ బూర్వుఁడే యని వాదమున కొప్పుకొనినను దాత్కాలికముగ, జనసామాన్యమునకుఁ దేలికగాఁ దెలియుటకై జాను తెలుఁగులో వ్రాసితి నని సోమనాథుఁడు చెప్పుకొనినప్పు డాభాష ప్రాతవడ్డమాటలతో నేలయుండును ? ఆకాలమున జనసామాన్యమున వ్యవహారములో నుండకపోయిన నాపదములాకాలమువారి కెట్లు తెలియును ? కాన నాభాష ప్రాతవడ్డది కాదనియు, నాకాలమున వ్యవహారములో నున్నదే యనియు నమ్మవచ్చును. అట్లే రసజ్ఞుఁడును, మహాకవియు నైన నన్నెచోడునిభాష గూడ. మఱియు శ్రీ లక్ష్మీకాంతముగా రిట్లు పలికిరి-

"ఈతనిభాషలో నాటికే ప్రాతవడ్డమాట లెక్కువగా నున్నవని తండోపతండములుగా నుదాహరణలు చూపవచ్చు." అని. కాని యొక్కయుదాహరణమునుగూడ వా రీయలేదు. మఱియు నీతని భాషలో నాకాలమునాఁటికే ప్రాతవడ్డమాట లెక్కువగా నున్నవని వీరు నిర్ణయింపఁగల్గుటకు ముఖ్యకారణ మతనికంటెఁ బూర్వుఁడగు నన్నయకవిత్వములోఁ బ్రసన్నత యుండుటయేనఁట. మొట్టమొదట నన్నెచోడునికవిత్వమునఁ బ్రసన్నత లేదని భావించుట సమంజసముగ

లేదు. శ్రీ లక్ష్మీకాంతముగారు ఆంధ్రసర్వస్వమునఁ దెల్పిన "ఆభావము అపేలవము, మధురమునైన పదములతో వ్యక్తమగుట, ఆపదములలో నెక్కువపాలు జాను తెనుగనుపించుకొని దేశ్యపదజాలమే యగుట స్పష్టమగుచుండును" అను వాక్యములే నన్నెచోడుని కవిత్వము ప్రసన్నమైనదని తెల్పుచున్నది. మఱియు నన్నెచోడునికవిత్వములో, నన్నయకవిత్వమునఁ గలప్రసన్నత లేకపోవుటకుఁ బ్రాతవడ్డమాటల ప్రయోగించుటయే హేతువని భావించుట యెంతమాత్రము సమంజసము కాదు. ఎందుకన నన్నయభట్టుకవిత్వమునందే యిప్పటికి ప్రాతవడ్డపదములు విశేషముగ నున్ననుగూడఁ బ్రసన్నతఁ గోల్పోలేదు. నన్నయభారతములోని ప్రాతవడ్డమాటలకు కోరాడ రామకృష్ణయ్యగారు భారతి, (సర్వజిత్తు–పుష్యము; సర్వధారి–ఆషాఢము) సంచికలలో వ్రాసిన 'నన్నయ తెలుఁగు' అనువ్యాసములను చూడుడు. ఉదా:– 'అగ్నులను విహరింపనిమ్ము' మొదలగునవి. కాన నన్నయనన్నెచోడుల భాషావైవిధ్యము ప్రాతవడ్డమాటలను ప్రయోగించుటలో లేదనుట స్పష్టము. మఱియు నన్నయకవిత్వములోఁగల ప్రసన్నత తిక్కనకవిత్వములోఁగూడ లేదని సుప్రసిద్ధాంధ్రపండితు లందఱు నేకగ్రీవముగా నంగీకరించిరి. దీనికిఁ గారణముగూడఁ దిక్కనకవిత్వములోఁగల ప్రాతవడ్డమాటలేనా ? కాన నన్నయనన్నెచోడుల రచనలలోఁగల భేదము వారి భాషాప్రయోగవిధానమున నున్నది. ఈవిషయమునుగూర్చి తెలిసికొనఁగోరువారు మద్రాసువిశ్వకళాపరిషత్తు ప్రచురించిన నన్నెచోడకుమారసంభవపీఠికలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి రచనమును తిలకించునది. నన్నయభాషాప్రయోగవిధానము మార్గపద్ధతిగాఁ బరిగణింపఁబడి, లక్షణకర్తలచేఁ బ్రామాణికముగ గ్రహింపఁబడుటచేతన కది సుపరిచితమై వీనులకు ప్రసన్నముగఁ గనఁబడుచున్నది. నన్నెచోడుని భాషాప్రయోగవైఖరి దేశిపద్ధతికిఁ జేరి కొంత విప్లవమార్గము

నకుఁ జెందినను నాకాలపు జనసామాన్యభాషాప్రయోగపద్ధతిని ప్రతి పాదించును. ప్రస్తుతకాలముననున్న గ్రాంథిక- వ్యావహారిక భాషావాద ములవలె నానాఁడు, నన్నయపద్ధతి గ్రాంథిక భాషాసంప్రదాయమునకుఁ జెందఁగా, నన్నెచోడునిరీతి వ్యావహారికసంప్రదాయమునకుఁ జెందినది. గ్రాంథిక భాషారూపములు గ్రాంథిక భాషావాదులకు ప్రసన్నతతో ధ్వనిం పఁగ, వ్యావహారిక భాషావాదుల కవి కృతకములుగ వినిపించును. అట్లే వ్యావహారిక భాషారూపములు వ్యావహారిక భాషావాదులకు జీవకళతో గోచరింపఁగ, నవే గ్రాంథిక భాషావాదులకు శ్రవణకంటకములుగాఁ దోఁచును. ఇవి పరిచయాభిమానములవలన నేర్పడినవి. ఇఁకఁ దిక్కనను గూర్చి యాంధ్రసర్వస్వములో శ్రీ లక్ష్మీకాంతముగారు ఇట్లు వ్రాసిరి. "అసలు భారతరచనాధికార మాంధ్రకవులలో దిక్కనకువలె నింకొ కనికి గలదనుట సందేహాస్పదము" అని, మఱియు "అవిప్రపథసుప్రయ త్నము గనుక ఆయన (నన్నయ) చేతిలో తత్సమశబ్దజాలమువలె శుద్ధాంధ్రము వృద్ధినొందలేదు. అచ్చతెలుగున కాప్రతిష్ఠ సంపాదించిన వాఁడు తిక్కన......ఈభాషనంతయు నాయన సృష్టించుకొన్నదే. ఆస్పష్టిలో ఆనాటి వాడుకపదములు చాలవర కాయనకు బీజములుగా నక్కరకు వచ్చియుండును. ఆపదములకే క్రొత్తప్రాణము పోసి భారత మున సుప్రతిష్ఠితము చేసెను." ఈవాక్యములే యథార్థమగునో, నన్న యతిక్కనల మధ్యనున్న నన్నెచోడుని భాషనుగూర్చి వెనుక నుదా హరింపఁబడిన శ్రీ లక్ష్మీకాంతముగారి వాక్యములగు "ఆభావము అపేల వము, మధురమునైన పదములలో వ్యక్తమగుట, ఆ పదములలో నెక్కువపాలు జానుతెను గనిపించుకొను దేశ్యపదజాలమే యగుట స్పష్టమగుచుండును." అని వ్రాయుటలో నౌచిత్య మేమి ? దేనిదారి దానిదేనా? పూర్వాపరసంబంధ మక్కఱలేదుకాఁబోలు. ఇందుచేతనే 'నన్నెచోడుఁ డుపచారపూర్వకముగఁ గొనియాడఁదగిన కవీశ్వరుఁడు'

గను, సీతనికావ్యము రెండువిరుద్ధాంశములకు సంగమస్థానముగను గోచరించినవి. శ్రీ లక్ష్మీకాంతముగారు తిక్కనమీఁదఁ జూపిన యౌదార్యము నన్నయనన్నెచోడాదులమీఁదఁ గనుపఱచిన చో నాంధ్రవాణి కృతజ్ఞతల నందుకొనెడివాఁడే.

తర్వాత శ్రీ లక్ష్మీకాంతముగారు ప్రాచీన నవీన కవిత్వలక్షణములను వివరించుచు, రేడియోప్రసారమున నిట్లు చెప్పిరి.

"ప్రాచీన నవీనత లనేవి కాలమునుబట్టిమాత్రమే యేర్పడేవి కావు. ఆయాకవుల రచనాపద్ధతులనుబట్టికూడా ఏర్పడుతూ వుంటాయి. ప్రాచీనకవిత్వానికి-సాధుత్వము, సహజసౌందర్యము, అలంకారాల్పత్వము, బహువర్ణనారాహిత్యము, కథాప్రాధాన్యము-ముఖ్యలక్షణాలు. నవీనకవిత్వానికి-శబ్దజటిలత, అర్థచమత్కారము, వర్ణనాబాహుళ్యము, అలంకారభూయిష్ఠత-ముఖ్యలక్షణాలు."

"ఈవిభాగమునే యింగ్లీషులో 'క్లాసిసిజం అండ్ రొమాంటిసిజం' అంటారు. ఈఅర్థములో మన ప్రాచీననవీనకవులను 'ఆర్షకవులు-లౌకికకవులు' అని అనవచ్చు. ఆర్షకవు లనగా కేవలము ఋషికవులనే కాదు-ఆ సంప్రదాయానుసారము పురాణేతిహాసములను, కావ్యములను వ్రాసిన కవులందరు ఆర్షకవులే. కుమారసంభవకథగల ప్రాచీనశివపురాణాన్ని చూస్తే ఆరచన ఆర్షమనీ, దానితో పోల్చినపుడు కాళిదాసు రచన పైనచెప్పిన (ప్రాచీన నవీన కవిత్వ) లక్షణాలనుబట్టి లౌకికమేనని స్పష్టమౌతుంది. ఆ కాళిదాసుతో నన్నెచోడుని పోల్చిచూస్తే, యీ తెనుగుకవిత్వము లౌకికము. ఆ కాళిదాసుకవిత్వము ఆర్షము అనిపిస్తుంది. అనగా- లౌకికము అనదగిన నవీనకవిత్వానికి యిందాక చెప్పిన లక్షణాలు కాళిదాసుగ్రంథంలోకంటె నన్నెచోడునిగ్రంథములో చాలా యెక్కువగా ఉంటాయన్నమాట." పైన వివరింపఁబడిన

ప్రాచీన నవీన కవిత్వలక్షణములు పురాణ ప్రబంధ కవిత్వలక్షణములే కాని యితరములు కావని యందఱు గ్రహింపఁగలరు. ఇట్టిచో వారికి ఆర్షకవు లని- లౌకికకవు లని గంభీరనామముల నొసఁగుటలోఁ బ్రయోజన మేమి? పురాణకవులు- ప్రబంధకవులు, అను ప్రసిద్ధములైన పదములు పరిచితము లగుటచే జనులకు సులభబోధక మగునుకదా.

ఇఁక శ్రీ లక్ష్మీకాంతముగారి వ్యాఖ్యానముప్రకారము, ఆర్షకవిత్వము- లౌకికకవిత్వము- అనునవి ప్రతికాలమునకుఁ దారుమారై, వెనుకముందులకు సర్దుకోవలసియే యుండును. అట్టి నిలకడలేని యర్థముతో నాపదములను ప్రసిద్ధార్థములనుండి తొలఁగించి వాడుటవలని ప్రయోజనము కాని, యౌచిత్యము గాని, యవసరము గాని కనఁబడదు. ప్రాచీననవీనకవిత్వములె "క్లాసిజం అండ్ రొమాంటిసిజం" అని అంటారఁట. సంస్కృతివాఙ్మయమునకు నాంధ్రవాఙ్మయమునకు సన్నిహితసంబంధముండుటచె నందలి పారిభాషికపదము లిందు సమన్వయింపవచ్చును. కాని పాశ్చాత్యవాఙ్మయసంప్రదాయములకు నాంధ్రసారస్వతసంప్రదాయములకు భేద ముండుటచే నందలి పారిభాషికపదముల నిందు సమన్వయింపఁజూచినచోఁ గొంత తికమక జరుగును. 'క్లాసిజం-రొమాంటిసిజం' అను పదములు పాశ్చాత్యభాషలందే కొంత యస్పష్టముగ నుపయోగింపఁబడుచుండె నని 'వాల్టర్ పేటర్' మొదలైనవారు తెలుపుచున్నారు. "The words 'classical and romantic,' although, like many other critical expressions, sometimes abused by those who have understood them too vaguely or too absolutely. Yet define two real tendencies in history of art and literature"- Romanticism by Walter Pater. ఇందుచే నీపదములకు సరియైనయర్థ మేదో విచారించి, యవి యాంధ్ర ప్రాచీన నవీన కవిత్వముల సమన్వయింపఁదగునేమో పరిశీలింతము. ఈరెండు సాంకేతికపదములను వాల్టరు పేటరే యిట్లు వివ

రించినాఁడు. "Classicism, means the reign of what is pedantic, conventional and narrowly academical in art. It is the characteristic of certain epochs, not given to the exercise of original imagination, but rather to the working out of refinements of manner on some authorised matter." ఇఁక రొమాంటిక్ కవిత్వలక్షణము నతఁడే యిట్లు తెల్పినాఁడు. "It is the addition of strangeness to beauty, that constitutes the romantic character in art." It is the addition of curiosity to this desire of beauty, that constitutes the romantic temper." పై వివరణమునుబట్టి సాంకేతికమును సంప్రదాయాను గుణము నైనకవిత్వము క్లాసిజ మనియుఁ, దద్భిన్నముగ నపూర్వమును, కుతూహలప్రేరకము నైనకవిత్వము రొమాంటిసిజ మనియుఁ దేలు చున్నది. దీనఁ బ్రాచీనకవిత్వము- పురాణకవిత్వము క్లాసికల్ కవి త్వము కావచ్చును కాని, శ్రీ లక్ష్మీకాంతముగారు తెల్పిన 'వర్ణనా బాహుళ్యము, అలంకారభూయిష్ఠత, శబ్దజటిలత ముఖ్యలక్షణాలుగాఁ గల లౌకిక- లేదా నవీనకవిత్వమునందు సాంకేతికత్వము ప్రాచీనార్ష కవిత్వమందుకంటె నధికముగా నుండుటచే నది 'రొమాంటిక్ కవిత్వ' మని యెట్లు చెప్పఁదగుచో తెలియరాదు. ఈ నవీన లౌకికప్రబంధ కవిత్వమున నపూర్వత కాని, కుతూహలప్రేరకత్వము గాని లేదనియు, నొకప్రబంధమును జదివినచో నితరప్రబంధముల వేనిని జదువనక్కఱ లేదను నపప్రథ కదా కలదు. అట్టి కవిత్వమునకు "రొమాంటిక్" కవిత్వ మనుట యుచితమా ? 'క్లాసికల్, రొమాంటిక్' కవిత్వములకుఁ దెలుఁగున 'మార్గ-దేశి' కవిత్వము లను మన వ్యవహారములోనున్న పదములను వాడుటయే యెక్కువసమంజసముగాను, సన్నిహితముగా నుండునేమో విచారింపఁదగినది. 'మార్గ' యనఁగాఁ బ్రాచీనమార్గా నుసరణమైన సాంకేతికపూర్వసంప్రదాయానుగుణమైన కవిత యనియు,

'దేశి' యనఁగా వివిధదేశములందు జనుల వివిధాభిరుచుల ననుసరించి హృదయరంజకముగా రచింపఁబడిన కవిత యని యర్థ మగును. ఈ పదములను నన్నెచోడ పాల్కుఱికి సోమనాథులు కవితాపరముగను, సంగీతశాస్త్రజ్ఞులు సంగీతపరముగను వాడిరి. ఉన్న దున్నట్లు, అన్యూనాతిరిక్తముగఁ జూచిచెప్పుటయే విమర్శ యగునుగాని యితరము కాదు. "The true critic must be able to see a thing as it really is, and not distorted though a mist of his own idiosyncracies and prepossessions; he must be entirely disinterested and free from bias of individual tastes, education creed, sect, party, class, nation etc." అని మాత్యూఆర్నాల్డు ఉపదేశము. మఱియు విమర్శనల యుపద్రవమునుగూర్చి W. H Hudson పండితు డీవిధముగ హెచ్చరించినాడు "This danger is the more to be ephasised because it increases with the power of the critic himself. If he is a really great critic- ie, if he is a man of exceptional learning grasp and Vigour of personality- he is likely to impose himself on us. Painfully aware by contrast of his strength and our own short- comings, we yield ourselves to him. He dominates our thought to such an extent that we take his verdict as final Henceforth we look at the book, not with our eyes, but through his We find in it what he has found there and nothing else. What he missed, we miss too. Thus in fact. he stands beteen us and his subject, not as an interpreter, but as an obstacle. Instead of leading us, he blocks the way."

University of Madras,<br>MADRAS—5

శిష్టా రామకృష్ణశాస్త్రి.

# శ్రీ వేఙ్కటేశాష్టకము

కె. హెచ్. వి. శర్మ, ఎమ్. ఏ. బి. ఇడి.,

బళ్లారిజిల్లా హొసపేటతాలూకా హంపినగరమందలి శ్రీ కోదండ రామస్వామి యాలయమునొద్ద, శిథిలవైష్ణవాలయద్వారమున కిరు ప్రక్కలఁ జెక్కఁబడిన శిలాశాసనములోని భాగ మియ్యది.[1] కోదండ ఋషిగోత్రుఁడు వైశ్యకులజుఁ డగు అప్పిసెట్టికి పౌత్రుఁడును, పాపిసెట్టికిని పాటమ్మకును జనించిన తిరుమలసెట్టి ప్రీతికొఱకీ వేంకటేశాష్టకము లిఖించఁబడినట్లు చెప్పఁబడినది.

దశావతారములలో బుద్ధునియవతారముఁ దప్ప మిగిలిన వన్నియు నిందుఁ జక్కఁగా వర్ణింపఁబడినవి. మొదటిశ్లోకమునందుమాత్రము తిరుమలసెట్టిని రక్షించుటకే శ్రీమహావిష్ణువు లక్ష్మీసమేతముగ వాహనమైన వైనతేయునితోఁగూడ శేషగిరిని వదలి తుంగభద్రాతీరమందలి శ్రీచక్రతీర్థమునకుఁ జనుదెంచినట్లు వర్ణింపఁబడినది. తదుపరి "మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహోఽథ వామనః రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిరేవ చ॥"-అనువరుస ననుసరించి పరశురామావతారమువఱకుఁ గల యవతారముల నన్నింటి నొక్కొక్కశ్లోకముననే వర్ణించి యెనిమిదవశ్లోకముతో నష్టకముగా ముగింపఁదలఁచి కోదండ రామ, బలరామ, కల్కిరూపముల నొక్కశ్లోకముననే పేర్కొని బుద్ధుని విడచిపెట్టెను. ఫలశ్రుతితో నవమశ్లోకము పూర్తిచేసెను.

శాసనమునందు తుదిభాగము పోవుటచేఁ గవినామము దెలిసికొన వీలు లేకపోయినది. లేఖకునకు నక్షరజ్ఞానముఁ దప్ప భాషాజ్ఞానమేమియు లేనట్లగపడును. అష్టక మంతయుఁ దప్పులతడకగా లిఖించెను. దీనికాలము విజయనగరమహారాజైన సదాశివరాయనికాలమున శాలివాహనశక 1478 నళసంవత్సర కార్తిక శుద్ధ ద్వాదశి శుక్రవారము;

---

1 Sree Annual Reports on Epigraphy No. 701 of 1922.

సరియగు క్రీ. శ. 1556 అక్టోబరు 15 గురువారము గాని శుక్రవారము కాదు.

ఇది శ్రీ వేంకటేశ్వరకావ్యకలాపమునందుఁ గాని తదితర గ్రంథములయందుఁ గాని ప్రకటింపఁబడియుండనందున, భక్తుల కుప యోగించు ననుకుతూహలముచే నాచేతనైనంతవఱకు సవరించి ప్రక టించుచున్నాను. 2

౧. సంరక్షితుం తిరుమలాభిధవైశ్యవర్యం
హిత్వా ఫణీశ్వరగిరిం సహ వార్ధిపుత్ర్యా ।
ప్రాప్తం ఖగాధిపతినాపి చ తుంగభద్రాం
శ్రీ చక్రతీర్థనిలయం భజ వేంకటేశమ్॥

౨. వేదాన్ పరైః ప్రముషితాం శ్చతురో విచేతుం
మాత్స్యం వపు స్సులలితం ప్రతిధారయన్తమ్ ।
ఆలోడితాంతరపయోనిధివారిపూరం
శ్రీ చక్రతీర్థనిలయం భజ వేంకటేశమ్॥

3. పాథోధిమంథనకృతే త్రిదశై రశేషైః
పాథోనిధౌ నిహితమంథరశైలవర్యమ్ ।
భర్తుం పునర్విహితకచ్ఛపరాజవేషం
శ్రీ చక్రతీర్థనిలయం భజ వేంకటేశమ్॥

౪. శౌర్యాతిరేకశకలీకృతవింధ్యశైల-
దైత్యాధిపస్య హననాయ మహీం చ మగ్నామ్ ।
ఉద్ధర్తు మార్జితవరాహవపుర్విశేషం
శ్రీ చక్రతీర్థనిలయం భజ వేంకటేశమ్॥

2. దీనినిట్లు ప్రకటించుటకు అనుమతినొసంగిన శ్రీ డాక్టర్ డి. సి. సర్కార్ గారికి నేనెంతయు కృతజ్ఞుడను.

౫. పిత్రా నిజేన చ రుషా పరిపీడ్యమానం
ప్రహ్లాద మేవ పరిరక్షితు మాత్మభక్తమ్ ।
స్తంభా ద్వినిర్గతతనుం నరసింహరూపం
శ్రీ చక్రతీర్థనిలయం భజ వేంకటేశమ్॥

౬. ఆక్రమ్య సర్వజగతీం బలిమర్దనాయ
దాతుం పున ర్మఘవతే త్రిదివాధిపత్యమ్ ।
ఆదాయ వామనతనుం జితసర్వలోకం
శ్రీ చక్రతీర్థనిలయం భజ వేంకటేశమ్॥

౭. ఉన్మార్గ ఏవ చరతాం పృథివీపతీనా
ముత్పాటనాయ జనితం జమదగ్నివంశే ।
పాపీయసాం పరశునిర్జితకార్తవీర్యం
శ్రీ చక్రతీర్థనిలయం భజ వేంకటేశమ్॥

౮. రక్షఃప్రలంబపురయూథకలీ ర్విజేతుం
క్లప్తావతార మఖిలై రభివంద్యమానమ్ ।
కోదండరామహలభృత్కలి కల్కిరూపం
శ్రీ చక్రతీర్థనిలయం భజ వేంకటేశమ్॥

౯. శ్రీ వేంకటేశాష్టక మిదం ప్రియయం మీశ్వరస్య
యో వా పఠే ల్లిఖతి పృచ్ఛతి భక్తియుక్తః ।
దారై స్సుతై స్స ఖలు విందతి దీర్ఘ మాయుః
క్షిత్యాం కిల శ్రియ ముపైతి విధూతరోగః॥

# ఉదారరాఘవము – పరీక్ష.

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్రీమ ద్రామాయణేతివృత్తము ప్రబంధరూపమున, గద్యరూపమునఁ, బద్యరూపమున, గేయరూపమునను సమస్తదేశములలో, భూతభవత్కాలముల రచింపఁబడియుంటుటకు– రచింపఁబడుచుండుటకు హేతు వా కథయందలి సమగ్రమైన– నైతికరూపకమైన– యుత్తమ మానవసంసారమున కత్యంతసాన్నిహిత్యము గల విషయమే యని యంగీకరింపక తప్పదు. అవతారదశకమే కాక యేకోనవింశత్యవతారము లున్నవే! అవియుఁగాక త్రిమతాచార్యులు– గాంధి, శాయీ– హరనాథుఁడు, రాధాస్వామి మొదలగువా రెందఱెందఱో యాధునిక భక్తులచే నవతారపూరుషులుగ నంగీకరింపఁబడి యర్చింపఁబడుచున్నారే! రామావతార మొక్కఁడే నాఁటినుండి నేఁటిదనుక భారతదేశముననేకాక పరదేశములలోఁగూడ శాశ్వతికప్రతిష్ఠ సంపాదించుకొని సుస్థిరస్థితి నందుట కెద్దియో మహత్తరకారణ ముండవలయును గదా!

ఒక గ్రంథముగాని, యొక లేఖగాని, తుద కొక బట్టలపద్దుగాని వ్రాయుటకు ముందుగ శ్రీరామనామము వ్రాయక ప్రారంభింపమే! నాలుగుకొంపలుగూడ లేని పల్లెలలోఁగూడ రామునికో వెల యున్నదే! అనుకంపాకరమగు నొకదృశ్యమును గాంచినపుడుగాని, యొకవార్త నాలకించినపుడుగాని యప్రయత్నముగ, నస్వైచ్ఛికముగ రామశబ్దము ద్విగుణీకృతమై మన నోటినుండి యుట్టిపడునే! కారణ మేమి? రామావతారవైశిష్ట్య మేమి?

రామచరితముతో మానవజీవితమున కనంతమగు ననుబంధమున్నది. దానిలో ననుసరణీయములగు ననంతవిషయము లున్నవి.

త్త్రైకాలికజనసాధనీయములగు నార్జవ మనుపదమున నాక్రమించి యున్నది. రామభద్రునియందే కాదు- ఆతని వంశమందు- ఆతని సాధ్వియందు- నాతని సోదరులయందు- నాతని పితలందుఁ- బరివార మందుఁ- దుదకు శాత్రవులందుఁగూడ నీతిజ్ఞత, యుదారత తరంగిత ములై యున్నవి.

విశాలవిశ్వమున నెన్నియో యద్భుతరాజన్యచరితము లున్నను వాల్మీకి, కాళిదాస, భాస, మురారి, భవభూతి, భోజ, జయదేవాది గీర్వాణకవులును, నాధునికాంధ్రకవిలోకమును గూడ రామకథానకము గైకొని శక్త్యనుసరణముగఁ గవితావైదగ్ధ్యము నేల చూఁపినారు?

శ్రీరామునికంటె యుత్తమకథానాయకుఁడు కవుల కావ్యరచ నకై వేఱొకఁడు లభింపఁడు. రామాయణము నధిగమించిన కావ్య వస్తువు వారికి దుర్లభము. కవిప్రతిభావ్యుత్పత్తుల ననుసరించి వానిరచ నలు శోభించును. ఉత్తమమగు నితివృత్తము లభించినపు డది కవి యొక్క యసామర్థ్యమును గొంత మరుగుపఱచఁగలదు. ఎంతటి యసమర్థకవిరచనమైనను హరిశ్చంద్రేతివృత్తము శ్రోతల ప్రేక్షకుల హృదయములఁ గొంత ద్రవింపఁజేయక మానదు.

శాంతము, నార్జవము, పవిత్రవర్తనమును గల శ్రీ కుందూరి ఈశ్వరదత్తసుకవినిగూడఁ దొంటివారినివలెనే యీ రాఘవచారిత్ర మాకర్షించి యాంధ్రనాటకరూపమున నవతరించుటలో నాశ్చర్య మావంతయును లేదు.

ఉత్తమకవి నిజరచనకుఁ బ్రధానాధారమునఁ జిరంతనేతివృత్తము గైకొనినను, సందర్భానుసారముగ, సరసమగు పద్ధతిలో నైజకాలికాను భూతులఁగూడ నచటచటఁ జిత్రించుఁట గలదు. నాందీప్రస్తావనలో నటీప్రసంగమున "ప్రపంచమురీరు మీరు చూచుటలేదా, దేశమున

సుభాషితము శశవిషాణప్రాయ మాయెనుగదా. ప్రభువులా గర్వదుర్వినీతులు! ప్రజలా యజ్ఞానోపహతులు. కావున వినువారుఁ గను వారును గగనకుసుమములు. ఇఁక మిగులునది నాటకమాడుటకుఁ బడెడి యగచాటులుమాత్రమే. (పే. 2–5 పం.)

ఇందు "నాటకమాడుట" యను లోకోక్తి చక్కఁగఁ బ్రయోగింపఁబడినది. నాటకమాడుట యనఁగాఁ బ్రకృతార్థము రూపకప్రదర్శనము. అవహేళనోక్తి "కపటప్రవర్తన" మను ధ్వనిని సూచించును. మఱియు నధునాతనభారతప్రజానాయకులచే సశపథముగ వాగ్దానము గావింపఁబడిన రామరాజ్యతత్త్వమును బాహిరించుటయే యీ దృశ్యకావ్యరచనకుఁ బ్రయోజన మని కవి తెల్పినాఁడు.

రిక్తవాగ్దానములతోఁ, గ్రియాశూన్యులై గంభీరోపన్యాసములఁ గావించు దేశనాయకంమన్యుల నుపలక్షించి యీ సుకవి వాకొనిన వాక్యరత్నము లొకింత పరికింపుఁడు. (నాంది 3–4 పేజీలలో) "నటి భారతీయనాయకులు...............ఎవరితోవ వారిదే" నాటక ప్రయోగ పౌనఃపున్యావశ్యకతను గుఱించి శ్రీ దత్తుగా రీవిధముగ నూతనమనోహరోపమానమును రసికపాఠకుల కందిచ్చినారు. "మానవుల మనసులు తామ్రకలశములవంటివి. శుద్ధిచేయని నాఁడె యవి మలినము లగుచుండును" అని

కం. ధరణీసురుఁడు ప్రశాంతుఁడు
... ... ... పూర్వాకవీ
శ్వరవాక్ప్రయోగదక్షుఁడు
కరుణామతి యెవ్వఁ డతఁడె కవి యనఁబరగున్."

అను నప్పకవి నిర్వచనానుసరణములగు సుగుణము లన్నియుఁ శ్రీమదీశ్వరదత్తకవియెడఁ గలవు. భాష ప్రౌఢము, గ్రాంథికము. భావములు పురాతనాధునాతనవిమిశ్రితములు.

ఇఁక నుదారరాఘవనాకమందలి నాయికానాయకపాత్రముల సమాభాషణములయందలి యౌచితి నావంత యవలోకింతము.

చిత్రకూటాచలకూటమునఁ పర్ణశాలాబహిరంగణవేదిపై సలక్ష్మణుఁడై యున్న రామచంద్రుఁడు పర్ణశాలాంతరమునఁ గుసుమదామ రచనను సవదరించు జానకి నుద్దేశించి "మైథిలీ" యనియు, "వైదేహీ" యనియు, "జానకీ" యనియు సంబోధించి పిలిచెను. కాని "సీతా" యని యాకారించినపుడుగాని యామె ప్రత్యుత్తరింపనేలేదు. హేతువేమి ? సీత యుదారస్వభావాన్విత యగు నిరాహంభావపరిపూరిత స్వరూపిణి. "మిథిలానగరప్రభుతనయా" యనికాని "విదేహజనకరాజసుతా" యనికాని "రాజర్షిజనకాత్మజా" యనికాని సంబోధింపఁబడి యుమింతగౌరవభాజన యగుట యామెకిష్టములేదు. సర్వాధికుఁడగు, ప్రాణపదమగు తనజీవితేశ్వరునికంటె దాను గించిన్న్యూనముగానుంటయే యామె కంగీకార్యము. "సీతా" యని చనవుగ సప్రేమముగ సంబోధింపఁబడినపుడే తనకు రామునిహృదయమున శాశ్వతసంపూర్ణస్థానమున్నదని తాదాత్మ్యసంసిద్ధి గల్గినదనియామెయాశయము. "ఇయం సీతా మమసుతా" యని తనవివాహసమయమునఁ దనజనకుఁ డనిన మాటల జ్ఞప్తికిఁ దెచ్చినది. దశరథునిపిలుపుకూడ నుదహరించి పూజ్యపాదులయోడాటమునఁ దనకుఁగల భక్తిని వెలువరించినది.

సీతారాముల మిథోనురాగభూయిష్ఠమగు ప్రౌఢప్రసంగ మెంత హృదయంగమముగ నీకవిపుంగవుఁడు చిత్రించెనో శీలింపుఁడు.

"సీతా ! యీప్రదేశము కంటకశిలాపరివృతము. నీశిరీషసుమపేశలపదములు కందు నని విచారించుచుంటి" నని రామచంద్రుఁ డన "భయము లేదు కాని, ఈకటికితా లార్యపుత్రుని పదకంజములకు సోఁకినంతనే తపోవనమందలి నైష్ఠికబ్రహ్మచారులకుఁ బెండ్లికుమార్తెలు

లభింతురేమో" యని సరసముగఁ బ్రత్యుత్తరించుచు నహల్యాశాప నిమోచనగాథను స్మృతికిఁ దెచ్చుచు భర్తృమహిమను బ్రస్తుతించినది. ఈశ్వరదత్తకవి యేతన్మాత్రమున నాఁగలేదు. "పెండ్లికుమార్తెలు స్వాయంభువులు, పుడమిపుట్టువులు నగుచుండఁగఁ గాలూదుశ్రమ యను వసరము" అని సీతాజననవృత్తాంతము నిగూఢముగఁ మందహాసము గోరగింప రాముని చే బ్రసంగింపజేసినాఁడు. దానిపై వైదేహి "ఏపుణ్యా జనకునికో యట్టికన్య లభించి యుండవచ్చు" నని తనజనకుని గూని యాడుచుఁ బలుకులలో భావములలోఁ దనకుఁగల ప్రౌఢతనముఁ బోహాళించినది. కవివరుని రసికతకుఁ బ్రౌఢిమకు నీయుదాహరణము చాలు ననుకొందును.

"సరసఘనసంసర్గ మెప్పుడును వ్యసనదగ్ధశరీరములకు శాంతి సంతోషదాయకము గదా" యనియు, "తీక్ష్ణకరులగు ప్రజాధ్యక్షులు విషమమార్గముల ననుసరించి చరించినఁ బతనము తప్పదు" అనియు లక్ష్మణునిచే శ్లేషోక్తులఁ బలికించి యాతని రామానుజత్వమునకు వన్నె వెట్టినాఁ డీ ప్రౌఢరచయిత.

తృతీయాంకమున శ్రీదత్తకవివరుఁడు రామభద్రుని సోదరులను, మాతృత్రయమును, జానకిని, వసిష్ఠమౌనీంద్రుని, జనకుని చిత్రకూటతట మున సంఘటితపఱచి వారివారిస్వభావముల కనుగుణముగ సమా భాషింపఁజేసిన పద్ధతి మనోజ్ఞముగ నున్నది. రాముని వినయవినయ గంభీరవాక్యములును, భరతుని యాజ్ఞవభరితాభ్యర్థనపద్ధతియు, లక్ష్మణ శత్రుఘ్నుల వావదూకతయు, నరుంధతీధవుని యాదేశపావిత్ర్యమును, జనకరాజర్షి ప్రజ్ఞానబోధప్రకారమును సహజముగు- సక్రమముగు- సము చితముగు పద్ధతిలో విరచించి "యగ్గిరామునిగ- దొంగరామునిగ- బలే రామునిగఁ- (సినీమాకథలు) జిత్రింపక నచ్చముగ దశరథరామునే పాఠకుల మనఃపీఠికపైఁ బ్రతిష్ఠించుచు నాదికపీంద్రుఁడగు వాల్మీకియడుగు

వాడలలోఁ బ్రయాణించి కృతకృత్యుఁడై ధన్యతముఁడైనాఁడీ యుదారరాఘవనాటకకర్త.

కాలమును, ధనమును వ్యయించి, గ్రంథానుభవమే కాక చిత్రకూటాచలప్రాంతవిశేషములతోఁ బ్రత్యక్షానుభూతిగూడ గడించి, తన రామభక్తి మేళవించి శ్రద్ధాళువై యీ రూపకరచన సల్పిన మా యీశ్వరదత్తకవీంద్రుని పవిత్రవ్యవసాయమునకు స్వస్తి యగుఁగాక.

ఇట్టి పవిత్రదృశ్యకావ్యమున కాంధ్రప్రముఖులును, వింధ్యప్రదేశీయరాజ్యపాలకులు నగు శ్రీ మొసలికంటి తిరుమలరావుగారు కృతిపతు లగుట యభినందనీయము.

అభిలాష యున్నను వ్యాసబాహుళ్యభీతిచే నింతటితో నీ వ్యాసరచనకు నేనును స్వస్తి చెప్పుదును. కవీంద్రుని యిష్టదేవుఁడగు శ్రీరాఘవుఁడే యాతని కాయురారోగ్యభాగ్యములఁ బ్రసాదించి యితోధికసుందరము లగు నాత్మీయకథాఘట్టముల రూపకరూపకముగ రచింపఁజేసికొనుఁగాక.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



క. తా నరసి సహస్రంబున
నూనంబుగ నిడిన యీ మహోత్పలములలోఁ
గానంగఁ బోల దొక్కటి
యూనలినము లేనికతము నారసి కందున్

క. పట్టిన పనికిన్ భంగము
పుట్టినయెడఁ దెలివికలిగి బుధుఁడగు పురుషుం
డెట్టోకో కొదనడకుండఁగ
నెట్టన

ఆ॥వె॥ అనుచు నమ్మకుందుఁ డాపంకజము మార్గ
మరసి యరసి మానసాంబుజమున
నుఱక మెలమిఁగోడ నొక భంగి యలవడఁ
గాంచి యిట్టులనియెఁ గ్రమ్మఱంగ

క. ఎఱుగంబడియెను గర్జము
కఱకంఠుఁడు నాదునిష్ఠ గానఁ దలఁచి తా
మఱుపఱచినవాఁ డబ్జము
పెఱయుక్తులు వలవ దింకఁ బెక్కులు దడవన్

క. ననుమోసపుచ్చ నీగతిఁ
దనకు వశమె బాలచంద్రధరుఁ డక్కట యీ
యనుమానమేల మాన
మున నిలిపెం దీనికేమి మునుమిడి నేనున్

క. కమలము మాఱుగ లోచన
కమలంబును
త్కమలములను (నీ) శ్వ (రు) పద
కమలములు మదీయభావ కమలంబలరన్

క. అని తలఁచి యాక్షణము తన
కొనగోరు తిరంబుగాఁగఁ గుడివంక విలో
చనమునఁ గ్రేవంబాఱఁగఁ
జొనిపి వెసన్ బెల్లగించె సుస్థిర భంగిన్

క. అరుదుగ ధృతిభూమికుఁడగు
పురుషుఁడు మనువీక్షణమునఁ బొందించిన యా
కరిణికపుచ్ఛిన కరణిని
హరి పుచ్చెం గన్నుసురు ___ ___ మార్గమునన్

ఆ॥వె॥ అప్పుడమ్మకుందు హస్తతలమ్మునం
దరుణరక్త సిక్త హారమగుచు
నలరె నతనినయన మాత్మరుజ్మగ్నష
ట్పదముగలుగు కోకనద మనంగ

వ. ఇట్లు తాత్పర్య పాటవంబున నిజచక్షు రుత్పాటనంబు సలిపి యనంత
రంబ

తే॥గీ॥ సర్వసత్త్వావలంబన సదయలీల
నూని వనజార్థముగ మామకీననేత్ర
వనజ మవధరింపుము నాదు వ్రతమునిండ
నలవరింపుము దేవ! శుభానుభావ!

మ. అని తత్పాద సమీపదేశమున నాహ్లాదంబునం బెట్టె లో
చన మంతన్ జడివట్టె పుష్పమయ భాస్వద్వర్ష మాపద్మనా
భుని మీఁదన్ మకరంద శోభ విచలత్పుష్పంధయ వ్రాతశో
భన ఝుంకారనినాద సంఘటిత శుంభద్దర్గనోద్ధ్వర్షమై

క. ఆలోనన హరుఁడును గరు
ణాలోలనిరూఢి వచ్చె నచ్చోటికి నా

త్మాలోకన పర్యుత్సుకు
నాలోక గురున్ ముకుందు ననుకంపింపన్

మ. కనియెన్ శ్రీపతియంత ముందట జటాకాంతార గంగానదీ
జనితాభంగతరంగఘట్టనవిధా జాగ్రత్ప్రయః ఫేనచా
లన శోభాపరిపూర్ణభావగతమాళా చంద్రహేలాప్రకా
శ నశుద్ధిస్ఫురణ స్ఫుటత్వకలితాశావర్గునిన్ భర్గునిన్.

క. తదనంతరంబ యీశ్వరు
పదములకున్ దండసరణిఁ బ్రణతుం డగుచున్
వదలక కరములు నిటలా
స్పదములుగా హరి నుతించెఁ బరువడి నతనిన్

సీ. ఈశాయ విశ్వప్రకాశాయ మోహాత
మఃప్రణాశాయ నమశ్శివాయ
పుణ్యాయ భక్తశరణ్యాయ పావన
మహిమగణ్యాయ నమశ్శివాయ
ధన్యాయ జగదేకమాన్యాయ దుష్టమ
మత్వశూన్యాయ నమశ్శివాయ
ధీరాయ విస్మయాకారాయ సంభవ
మరణదూరాయ నమశ్శివాయ
మదగజవిదారణాయ నమశ్శివాయ
మలినగుణ శోషణాయ నమశ్శివాయ
మంత్రరూపాహ్వయాయ నమశ్శివాయ
మంగళార్థ ప్రదాయ నమశ్శివాయ

శా. శ్రీకంఠాయ నమోఽస్తు కర్ణయుగళ ప్రేంఖ న్మహా కుండల
ద్గోకర్ణాయ జటాలతోత్థసుమన స్తోమాయ సోమాయ స

త్ర్యకాంతకాయ శుభప్రదాయ వృషరాడ్యానాయ నాథాయని
శ్శోకాయ ప్రమథేశ్వరాయ వినుతశ్లోకాయ తుభ్యంనమః

సీ. వందేభవంత మవక్ర విక్రమ కళా
వివిధభుజాటోప విశ్వరూప
సేవే భవంత మంచిత సలీయప్రభా
ప్రథమానగుణపాత్ర ఫాలనేత్ర
భావే భవంత మప్రతిమాన సుభగతా
విభ్రమసన్నాహ వృషభవాహ
యాచే భవంతి మయత్నసంవర్ధన
ప్రకట బలోదీర్ణ సకలపూర్ణ
సంశ్రయే భవంతం ధరాజల హుతాశ
గంధవాహ విహాయస కమలమిత్ర
చంద్రయజ్వ లసన్నామ సాంద్రవిభవ
కీర్తి విస్ఫూర్తి శృంగార గిరివిహార.

వ. అని మఱియుఁ బెక్కుభంగులఁ దన్ను నుతియించుచున్న ముకుందు
నకు నిందుధరుం డనుకంపాసంపన్మధురుండగుచు నిట్లనియె.

క. జగదభిరక్షణదక్షా
భగవంత సరోజనయన భావమున భవ
త్ప్రగణిత భక్తికి మెచ్చితిఁ
దగు వరములు గోరుమిత్తుఁ దక్కక యెలమిన్

క. అనవుడుఁ గ్రమ్మఱ నాహరి
వినతుఁ డగుచుఁ గేలుమొగిచి వేడుకతో నిన్
వినుతింపఁగఁ గన్నాఁడను
ఇను విహిత సిదులింత వెలియే నాకున్

ఉ. శక్రపురస్సరాఖిల దిశాధిపులెల్లను వచ్చివేఁడినన్
వక్రవిచారులం ద్రిదశవైరులఁ ద్రుంపగఁ బూనివేఁడెదన్
విక్రమసంపద న్సమరవీథుల నేను జయింపు నట్లుగాఁ
జక్రము నాకునిమ్ము నిజసంశ్రిత పోషణ! భోగిభూషణా!

క. నావుడు హరితోడ మహా
దేవుఁడు విను మేను దీనిదేవ హితార్థం
బావిష్కరించినాఁడ య
థావిధితో నీకునిత్తు దయతో ననుచున్

సీ. ఎయ్యది నిజతేజ మినుతేజమునమీఁద
నినుమడి తలచూప నినుమడించు
నెయ్యది తననామ మెల్లభూతములకుఁ
బరివర్ధనముగాఁగఁ బరగుచుండు
నెయ్యది విజయసమిద్ధరమాఖండ
విక్రమోద్ధత లేఖవెలయుచుండు
నదియనుగ్రహించె నబ్జనాభునకు సం
వర్తసమయ సంభవప్రచండ
పావకార్చిరుపమ భయదార్చిదుస్సహా
స్పర్శనంబు శ్రీసుదర్శనంబు.

క. తదనంతరంబసిత ప
ద్మదళాయిత సుభగరేఖ దనరారఁ న
మ్మదన జనకునకుఁ బ్రమదం
బొదవ సదాశివుఁడు నేత్రమొసఁగెంగరుణన్

వ. అట్లొసంగి ఫాలాక్షుండు పుండరీకాక్షుతోడ సురశ్రేష్ఠా! యింక
నభిమతంబులగు వరంబులడుగు మనవుడు; నతండు భవత్పాద్మార

విందంబుల యందలి భక్తి మదీయబుద్ధిఁ బాయకుండ నవధరింపుమను టయు, నట్లయిచ్చి ముకుందుస్వీడుకొలిపి సపరివారంబుగాఁ గైలా సంబునకు విజయుంచేసె; నంతనిక్కడ.

మ. సరసీజాక్షుఁడు లబ్ధచక్రుఁడగుచు న్సర్వామరవ్రాత ముం
గర మానందముఁ బొంద దానవభుజా గర్వంబు ఖర్వంబుగా
నరుసంబూర్వపదంబులందు నిలిపెన్ వజ్రిన్ శిఖిన్ దండిఁగ
ర్బురుఁబాశాయుతు మారుతున్ ధనదునిన్ రుద్రాహ్వయుంగ్రమ్మఱన్

క. చక్ర ప్రదాన మనఁగ శు
భక్రమ మహిమమునఁనొప్పు భవులీలను భ
క్తి క్రియఁ జదివిన వినిన న
వక్ర గతింగలుగు నిష్టవరలాభంబుల్

ఆ. వినుఁడు సముచితముగ వివరింతునిట నీఁ ద
నభవుఁడవధరించినట్టి లీల
యది కరంబు జగతియందు నాస్థాన వి
హరణ నామకమున నమరుచుండు

క. ఒకనాఁడు చారుహిమకర
శకలాభరణుండు దలఁచె శంభుఁడు లీలా
వికచగతి సకల సురముని
నికరంబులు కొలువు గొలువ నెమ్మదినుండన్

వ. నందికేశ్వరుతోడ హిమనన్నగంబున కరిగి యక్కడ నొక్క యుచిత స్థలంబున నాస్థాన మండపంబు మోహనాయితంబుఁ జేయించి రమ్మని యానతిచ్చిన నతండునుంబ్రసాదంబని విశ్వకర్మ సహితంబుగా మంచు గుబ్బలికిం జని యందు భర్గోద్దిష్ట మార్గంబున సభాసందర్భంబు సక లంబును మనోహరంబుగా నలవరించి మరల రజతాచలంబునకువచ్చి,

యవ్విభునకున్ దత్క్రమంబు విన్నవించిన విని దాక్షాయణియుం
దానును, దివ్యమాల్యాను లేపనాంబరాదులందగ నలంకృతులగుచు
శివుండు నక్కడంగదలి.

సీ. గుబ్బలికొమ్మలఁ గోరాడునప్పుడు
తగిలిన తునక క్రొమ్మొగులుగలిగి
వీఁపుపఁబులితోలు వెణఁదగాఁ గూర్పంగ
నెనసిన పసిడి పల్లణము గలిగి
రెండు గెలంకుల నెంపుగాఁ డెల్లని
జిగిమీఱు గనుపకుంచియలు గలిగి
యఱుతమానికముల గిఱిగొనుగంటలఁ
జదురారు ముత్యాల సరులుగలిగి
ఘనతఁ గైలాసమనఁదగు తనువుగలిగి
ప్రకటలీల నపూర్వదృక్పర్వమగుచుఁ
గడఁకఁ దనరాక యంతంతఁ గాంచి కాలు
ద్రవ్వి రంకెలువైచు గోరాజునెక్కి

చ. విభుఁడును నిట్లు మిక్కుటపు వేడుకఁ బ్రేయసితోడఁగూడ గో
ప్రభుఁ దగనెక్కి యోలిగణభర్తలు గొల్వగ వచ్చెఁ గర్ణవ
ల్లభ కలనాగభీరగతులన్ శివదుందుభు లుల్లసిల్లఁ ద
త్సభ సవిలాసయానమున సర్వజగత్పరిరక్షణార్థమై

క. గారవమొప్పఁ దదీయ
ద్వారమున ననంతరంబ వాహము దిగి యొ
ప్పార సతిదింపిభవుఁ డిం
పారఁగ లోపలికిఁజనియె నతివయుఁ దానున్

వ. ఇట్లిరిగి నితాంతవర్ణనా విచిత్రంబులగు సభావసధాంతర చిత్రవిచిత్రం బులుగనుంగొనుచు...ఆనందంబు తిలకింప నీశ్వరీసహితంబుగా భద్రా సనోపరిస్థలంబున నాసీనుండయ్యె; నయ్యెడం గాలరుద్ర గజాననులా జగన్నాథువానతిం బాదపీఠంబు సమీపంబునంబసిండిగద్దియల నారో హించిరి; యితర ప్రమధ ప్రవరులందఱు నాలుగునంకలంజరివేష్టించి రంతలోన సేవాతత్పరత నరుగుదెంచిన దివసనాథ శర్వరీవల్లభులు కనకకరంకముక్తాతపత్త్రంబులు నహించి; రంతకమున్న యద్భుత మూర్తులతోడంగొలిచివచ్చి చతుశ్శ్రుతులును గంగాయమునలును నికటంబునం జామరతాళవృంతంబులు నాలవట్టంబులుంబరిగ్రహించిరి; ప్రకోష్ఠంబుల హేమవేత్రంబులు మెఱయ నందిభృంగి రిటు లిరు వురు బహిర్ద్వార ప్రతీహారంబుల నధివసించిరి. విశ్వావసుండు మొద లుగాంగల గంధర్వులు నిజ విజయాభిధానంబులు ప్రబంధంబులుగాం దత్త్రపాగంబులు మేళవించుచుం దగిన తావులనిలిచి పాడుచుండిం రిట్లు మహేశ్వరునొడ్డోలగంబున నుల్లసిల్లుచుండంగా

మ. హరియున్ బ్రహ్మయువచ్చి రంత నిజదేహంబుల్ విస్మృప్రస్థితిన్
హరి రత్నచ్ఛవిగాంచ నచ్చ విగరంబందంబులై యుండంగా
సరసప్రక్రమ చక్రమద్ధరుండు హంస భ్రాజద్రథత్వరా
......పరివృత్యమాన విలసత్కార్ణా విలీనాత్ములై

సీ. చనుదెంచె నిర్జరేశ్వరుండు సంనాహ సం
భ్రమ దభ్ర సింధుర యానుండగుచు
నరుదెంచె సమవర్తి యంచిత రయ ఖిక
స్వర కాసర ప్రభు వాహుండగుచు
నేతెంచె నర్ణవాధీశుం డత్యద్భుత
క్రమనట న్మకరాత్మ గమనుండగుచు

